

# శ్రీ శ్రీ

# ప్రభవ

శ్రీ శ్రీ సాహిత్య సర్వస్వం - 1

కూర్పు

**చలసాని ప్రసాద్**




విప్లవ రచయితల సంఘం

ఆంధ్రప్రదేశ్

1999

30.09.1999

ప్రభవ

తొలి కూర్పు 1928 : మలికూర్పు 1999

# పరిణయ రహస్యం

రచన 1924

శ్రీ శ్రీ సాహిత్య సర్వస్వం- 1

---



ప్రచురణ విప్లవ రచయితల సంఘం
ఆంధ్రప్రదేశ్

కూర్పు చలసాని ప్రసాద్
విశాఖపట్టణం

కవర్ కంపోజింగ్ లక్ష్మి డిజిటల్ గ్రాఫిక్స్
హైదరాబాద్

టెక్స్ట్ కంపోజింగ్ ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్,
బాగ్‌లింగంపల్లి,
హైదరాబాద్-44, ఫోన్ 7660000

ముద్రణ చరిత గ్రాఫిక్స్
చిక్కడపల్లి, హైదరాబాద్, ఫోన్ 7607361

**సోల్ డిస్ట్రిబ్యూటర్స్ : నవోదయ బుక్ హౌస్,**
**3-3-865, ఆర్య సమాజ్ ఎదురువీధి**
**కాచిగూడ, హైదరాబాద్ - 500 027**
**ఫోన్ . 4652387**

**రూ : 30/-**

# వేకువ

**చుక్కలు** చూస్తున్నాయి కోళ్ళు కూస్తున్నాయి కాకులు కావు కావు మంటున్నాయి అప్పుడే పొడుస్తున్న లేత కిరణాలు చొచ్చుకుని వస్తున్నాయి. రాత్రి గడిచిపోయింది చదల చీకటి కదల బారింది శ్రీశ్రీ తొలి కావ్యం 'ప్రభవ' వెలుగు చూసింది ఇది అచ్చయినప్పుడు శ్రీశ్రీకి పద్దెనిమిదేళ్ళు ఈ దశలో తనేమిటో తానే చెప్పుకున్నాడు శ్రీశ్రీ. 'అటు విశ్వనాథ, ఇటు కృష్ణ శాస్త్రిల ప్రభావాలనించి బయట పడడానికి నాకు పదేళ్ళు పట్టింది ' 'విశ్వనాథ పద్యాలంటే కొంపెల్ల లాగా నాకూ ఎడతెగని మోజు', 'తెలుగు సాహిత్యం నన్ను 1930 దాకా నడిపిస్తే, ఆ తరవాత దాన్ని నేను నడిపించాను ' తొలిదశలో తాను పీల్చిన గాలి, తాగిన నీళ్ళు, తిన్న అన్నం మనందరి అనుభవంలోకి తెచ్చాడు శ్రీశ్రీ

'ప్రభవ' కన్నాముందు 'దివ్యాలోచనములు' గీతం 'స్వశక్తి' పత్రికలో అచ్చువేశారు పురిపండా అప్పలస్వామి అందులోని మూడోపాదం మాత్రం శ్రీశ్రీకే గుర్తు లేదు

**ఓ మహాత్మా! త్వదీయ మహోన్నత ప్రభావ**
**మింతని తెలుప నెవ్వారి తరము?**

... . ........... . . . .

**దివ్యాలోచనములు ప్రసాదింపుమయ్యా!**

'ప్రభవ'కి తొలి బీజం ఇది దీనినించి మొలకెత్తి, చిగురేసి, పూసి, కాసిందే 'ప్రభవ' అయితే ఇందులో కొంపెల్లకి సార్థకత కన్నా సమాస తత్పరతే కనిపించింది ఈ విమర్శ సవ్యమే అనిపించింది శ్రీశ్రీకి కూడా

అటు 'ప్రభవ'కీ, ఇటు 'మహా ప్రస్థానం' గీతాలకీ మధ్యలో ఇంచుమించు అయిదేళ్ళ ఎడం వుంది ఈ 'పంచాబ్దంబులు' శ్రీశ్రీ కవితా జీవితంలో అతి కీలకమయినవి 'ప్రభవ'లో ప్రతిధ్వనులుంటే 'మహాప్రస్థానం'లో ధ్వనులున్నాయి వీటి నడుమ తమ కవితాకంఠాలని వినిపించినవే 'స్వర్గదేవతలు' వీటికి చెవి ఒగ్గితేనే శ్రీశ్రీలో రాబోతున్న పెనుమార్పుని మనం ఆకళించుకోగలం. వీటిలో మనకి గొప్ప పెనుగులాట కనిపిస్తుంది ఈ తపన మనని ఆకట్టుకుంటుంది ఈ అయిదేళ్ళలో తను రాసిన ప్రతి కవిత గురించిన విశ్లేషణ తానే చేసుకున్నాడు శ్రీశ్రీ. మంచి విమర్శకునిగా తన కవితలని తానే తూకం వేసుకున్నాడు. అందుకనే ఆ తరవాత చలాన్ని 'తూచవద్దు. అనుభవించి, పలవరించమన్నాడు'. తన కవితా గమ్యం చేరుకోవడానికి అనువైన గమనం తీర్చి దిద్దుకున్నాడు వీటన్నింటి ఆనుపానులు తడుముతూ శ్రీశ్రీ నోట్సు రాసుకున్నాడు అది మా దగ్గర పదిలంగా వుంది శ్రీశ్రీ కవిత్వంలోని మెలకువలని అధ్యయనం చేసి, అవగతం చేసుకుందికి వీలుగా శ్రీశ్రీ నోట్సు యథాతథంగా అందరి ముందు వుంచుతున్నాం

ఈ సంపుటం కూర్పు గురించి చిన్న మాట ఇందులో తొలినించీ తుది దాకా మేం పాటించింది కాల క్రమణికే అయితే ఇందుకు మూడు మినహాయింపులున్నాయి పెళ్ళిళ్ళకు రాసిన పద్యాలు ఒక క్రమంలో వేశాం పిట్స్‌బర్గ్ (అమెరికా) లో నెలకొల్పబడిన తిరపతి వెంకటేశ్వరుడిని ఉద్దేశించి శ్రీశ్రీ చెప్పిన పద్యాలు విడిగా వేశాం అనువాదాలు చిట్టచివరకి చేర్చాం ప్రభవ (1928) నాటికీ, శ్రీశ్రీ సాహిత్య సంపుటాలు (1970) నాటికీ దొరకని కవితలు పది పోగుచేసి ఇందులో పొందు పరిచాం శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం సార్థకం కావాలనే మా పూనిక, పట్టుదల, ప్రయత్నం. ఎందరెందరి అండదండలతోనో ఇవి నెరవేరుతున్నాయని అందరికీ మేము మరోసారి విన్నవించుకుంటున్నాం సాహిత్య సంస్థగా ఇది మా బాధ్యతల్లో ఒకటని కూడా గుర్తిస్తున్నాం

విశాఖపట్నం
30 09 99



శ్రీ శ్రీ, రావిశాస్త్రి, చలసాని ప్రసాద్



నవవసంత ప్రాతరంచిత
భువనమోహన కుసుమ వల్లరి
గ్రీష్మకాలాతప భరమ్మున
గీటడంగినది

గాఢ నిద్రాముద్ర మేల్కని
కనుల దెఱచిన క్షణమునందున
స్నాన మని విని నంత నిలువున
జలదరించితిని

ఆ యకాల ప్రళయ ఝంఝా
వాయువులలో తెన్ను తెలియని
యత్యప్రాయ స్థితిగతుల యం
దవశతలు గలిగె

నా శిశుత్వాజ్ఞాన వేళా
నష్ట మాతృచరిత్ర నెఱుగను
తావకానిర్వాచ్య సద్వా
త్సల్యమున దల్లీ!

ఇపుడు నీవు గతించినంతట
నెచట దెలియని లోప మొదవెడు;
ఇవి నితాంతాజ్ఞాత నిష్ఠుర
దివస నిచయములు.

త్రిదివ ధామప్రథిత గాయక
మధురరుతముల నడుమ నించుక
మామకీనాలస రవమ్ముల
మనసు నిల్పఁగదే!

అంకితం

సుభద్రమ్మ
అమ్మకి
శ్రీశ్రీ

శ్రీశ్రీ జన్మించిన రెండేళ్ళ లోపుగానే కన్నతల్లి గతించగా, తండ్రి వెంకట రమణయ్య మళ్ళీ పెళ్ళాడారు పినతల్లి శ్రీశ్రీని గోముగా పెంచింది ఆమె కూడా శ్రీశ్రీకి దక్కలేదు 1924లో చనిపోయింది 'ప్రభవ' ఆమెకే అంకితం కన్న తల్లి పేరు అప్పన్న కొండకాగా, సవతి తల్లి, కాదు పెంచిన తల్లి పేరు బంగారు కొండ కావలసింది, సుభద్రమ్మ

# విషయానుక్రమణిక

## ఒకటి ప్రభవ



## 1. ప్రకృతి గీతములు



## 2. ప్రణయగీతములు



## 3. ప్రకీర్ణగీతములు



## 4. సమీక్ష

## రెండు.. స్వర్గ దేవతలు

### 1 కవితలు



### 2. అనువాదాలు



### 3. ఫుట్‌నోట్స్ 102

### 4. పరిణయ రహస్యము +

# ఉపక్రమణిక

**సారస్వతారామమున** నేడు ప్రభవించుచున్న కావ్యవల్లరులలో ఖండకావ్యమగ్ర తాంబూలమును స్వీకరించుచున్నది. ఒకప్పుడు పురాణములతోడను, మఱొకప్పుడు ప్రబంధములతోడను అలంకరింపబడు తెనుగు తల్లి నేడు ఖండకావ్య సంపుటములతో నలంకరింపబడుచున్నది ఆ దినములకును ఈ దినములకును పోల్కియేలేదు నాటి చవులు వేరు, నేటి చవులు వేరు నాటి కవులకు పాండితీ ప్రకర్షమే ముఖ్యము నేటి కవులకు స్వేచ్ఛయే ప్రధానము. వారు చాలవరకు తమ ప్రభువుల మెచ్చించుకొఱకు కృతుల రచించిరి నేటి మన వారొకరి కొఱకు వ్రాయుచుండుట లేదు స్వాతంత్ర్యమును విడిచి యొరులకై రచించు కావ్యమున కవితామతల్లి ఛాయామాత్రగ దర్శన మొసగును స్వేచ్ఛా రచనల యందాదేవి దివ్య సందర్శనము లభ్యమగును మొదటి విధమున నిర్మితమైన వసుచరిత్రయందుకంటె రెండవ విధమున నిర్మితమైన భాగవతమునం దామె కళా ప్రపూర్ణయై విలసిల్లుచున్నదనుట నిర్వివాదాంశము.

ఇవి కేవల స్వేచ్ఛాదివసములు ఆంధ్ర వాఙ్మయమునకిది స్వర్ణయుగము కాకున్నను ఆ యుగారంభమున కివి ప్రథమ దివసములనుట తథ్యము తిరుపతి వేంకటేశ్వర కవులతో ఆంధ్ర వాఙ్మయము పతనోన్ముఖమైనదను వారితో మాకుఁబని లేదు ఈ స్వేచ్ఛాదివసములలో ప్రభవించినదీ 'ప్రభవ' ప్రభవాబ్దమున కవి హృదయము నుండి వెలువడిన ఖండకావ్యములు 'ప్రభవ' యనుపేర సంపుటీకరణము గావింపబడినవి. గ్రంధకర్తయగు శ్రీశ్రీనివాసరావు గారిందలి ప్రతిగీతమును తాము రచింపగనే నాకడకు గొనివచ్చి శ్రవణానందము కలిగించు చుండెడివారు. కేవలము కడు పిన్నవయసుననే యిట్టి 'లలితభావ కవితా వియద్వాహిని' యలవడినది వీరికి. 'ప్రభవ' యందలి 'ఆధునిక దివ్యఖండ కావ్యములు' త్రిభాగ విభాగితములు

## 1. ప్రకృతి గీతములు

ఇందు మొదటిది 'స్వేచ్ఛ'. గంభీరమగు ధ్వనిని కవి యీ చిన్ని గీతమున చక్కగ నిముడ్చగలిగెను. పరికింపుడు 'ఆ మహోన్నత దివ్యవృక్షాగ్రమందు' (మానవలోకమున) 'పత్రసంఘముల నడుమ' (తోడి మానవుల నడుమ) 'జీవించియున్న కాల మాటపాటలతో బూర్తియైన వెనుక - కళల గోల్పడి కలుషపంకమున జిక్కి - నశింపక - క్రొత్త ఱెక్కల ధరించి అతి నిరాఘాటముగ విహాయసపథాల నెఱుకపడరాని యెచటికో ఎగసిపోదు'నని కవి మానవజీవిత రహస్యమును గొంతెత్తి పాడుచున్నాడు. ఓహో! ఈతని స్వేచ్ఛాభావము మెచ్చదగినది

నవీన కవికుమారులకుం బలెనే శ్రీనివాసరావుగారికి ప్రకృతి లక్ష్మియుపాస్యదేవత. అతడామెను పూజించును. ఆమె యంకమున నాటలాడును. ఆమెను గూర్చి పాట బాడును మాటలాడును ఆమెయందలి అన్వయముగాని వింత దృశ్యములను బాలునివలె ప్రశ్నించును ఆమె శరీర 'సౌరభాకృష్ట మధుర సంస్పర్శ సుఖము'న మైమరచిపోవును ఒకపుడామెను గాంచి

**మాధురీ మోహనంబిది! మసృణకుసుమ**
**వాసనా వాసితంబిది! వైభవ ప్ర**
**భావ బంధుర బహుతర ప్రభలకెల్ల**
**ఆటపట్టిది! ఇచట నే నాడుకొందు!**

★ ★ ★

**ఇది మనోజ్ఞ ప్రకృతిధామ మిచటఁ జేరి**
**అమృత పేశల నవమాధురిమము గూర్చు**
**విహగకలకూజిత ధ్వనీ విధములందు**
**స్వీయకంఠారవము మేళవించుకొందు!**

అని 'మరల మరల మంజుల గాన ఝరులఁదేలు'ను. ఒకపుడు వినువీధిఁ బరిభ్రమ మించు మేఘశకలము గాంచి

**ఈ ప్రకృతి గాథ రాహస్య మెఱుఁగలేక**
**చంచల మనస్కతఁ బరిభ్రమించు నాకు**
**విశ్వపథముల నడయాడి వేసరిలుట**
**అన్ని విధముల భావ్యమే యగును గాని -**
**ఓ వలాహక శకలమా! నీవు కూడ**
**నావలె బరిభ్రమించు చున్నావదేల?**

అని ప్రశ్నించును. 'సాంద్రచంద్రికా సముజ్జ్వల దివ్యశర్వరీ ప్రశాంతవేళ లం' దధిక సంభ్రమమున - సృష్టి సౌభాగ్య విభవవైచిత్రి గాంచి పరవశతనొంది గొంతెత్తి పాడుకొనును '

ఈతని 'రస పిపాసాతుర హృదంతరాళమునకు బ్రకృతియో షామృదూక్తులమృతనిభముగ హర్ష దాయకములు '

## 2. ప్రణయ గీతములు

ఇవి కేవలము పరమేశ్వరుని పరముగ రచింపబడినవి. పవిత్ర భావపుంజీ భూతములైనవి. 'కందళించిన హృదయారవింద సుమము' నా 'పరంజ్యోతి' స్వరూపమునకు 'భక్తి పూర్వకముగ సమర్పణ' మొనర్చుచున్నాడు కవి ఆ జగదేకపతి గూర్చి యభిసరణము సలుపునపుడు

**దుర్గమ భయంకరారణ్య దుర్గములును**
**ప్రళయకాల సమాన విభావరులును**
**ప్రణయరాజ్యరమా ప్రాణపతికొఱకయి**
**తరలి యరిగెడు నా కవాంతరములగునె!**

అని నిశ్చలత్వమును గాంచుచున్నాడు. 'వియోగాన్ని యతిశయించి తన యంగకముల నెల్లఁ గాల్చునపుడు కాఱుచున్న యనంతాశ్రుకణములందు స్నాన మొనరించి, తాప ప్రశాంతి నందెదననియు, 'అంతమే లేని విరహాంబు రాశి పొంగి పొరలి, తను వెల్ల ముంచునపుడు 'పూనికతో దానిమథియించి' అనంత సుఖసుధా స్వాదురసమును దుదకుబడసెదననియు, తన 'హృదయాంతరమున' 'భయంకర విరహ గాఢాంధకారమలము కొనునపుడు' అందే సహస్ర కిరణదేదీప్యమానకాంతి నరసెదననియు 'వియోగశాంతి' గనుచున్నాడు కవి దెంతటి యున్నత భావము! ఎంతటి సరళ స్వభావము!

'సముజ్జ్వల రజనీ విలాస పథముల ననుగమించుచు గుంజకుంజాంతరముల' నా విశ్వంభరుని, సురూప సందర్శనాశ 'నదేపనిగ' నన్వేషించి, 'విషణ్ణ గీతారవమున' బాహ్య విశ్వమ్ము మఱచిపోయి, కడు దపించును వడ వడ వడకి వడకి

'అతి పవిత్ర ప్రపూజ్యమన్యోన్య హృదయదీప్తమని యొండొరుల ప్రేమ దెలిసి కొని 'ప్రబలకష్ట పరంపరల్ ప్రతిఘటించి' నేటి వఱకు నిల్చిపోయి, ఈ నిరీక్షణ పరిణామమేమి యగునొ అని యూహించుకొనుచున్నాడు కవి.

## 3. ప్రకీర్ణ గీతములు

ఇందు 'గీత పద్యా'లలో కవి తనకు గీతములందు గల యసమానాను రాగమును,

పద్యములు - ముఖ్యముగ గీతపద్యము లవె
యొసగు నింతింతకాని సంతసము నాకు

అని చక్కగ దెలియ బఱచెను 'అంతిమయాత్ర'యను గేయమున గంభీరమగు వేదాంతార్థము గోచరించుచున్నది. చూడుడు

ఈ యవసథమందున వసి
యించుటయే సతతము నా
కవసరమని యనుకొని నే
నాశించితినా?

★ ★ ★

చిందఱవందఱలుగనై
చిందిన జ్యోతిశ్శకలము
లేక మహాతేజస్సున
నే కలియు గదా!

కడపటిదియగు 'మతస్వీకృతి' ప్రత్యేకముగ విమర్శింప దగినది. కవి యిందు కేవలము తన కల్పనాచాతుర్యముచే హిందూ మహమ్మదీయ సంయోగమును కడు పవిత్ర భావముతో నైపుణ్యముగ చిత్రించెను

లలితపద భాసురమై, అనర్గళధారాసంకలితమై, ఉన్నత భావద్యోతకమై "ప్రభవ" విలసిల్లుచున్నది ప్రతి గీతమునందును మాధుర్యము స్ఫురించుచున్నది. పెక్కుచోట్ల ఆంగ్ల సారస్వత చ్ఛాయలు పడినవి కవి విషయానుగుణ్యముగ వృత్తుల సాగించెను అంతిమయాత్ర మొదలగువానియందు కైశికియు, 'ప్రళయనర్తనము' మొదలగువానియం దారభటియు, 'మత స్వీకృతి' మొదలగు వానియందు భారతియు, 'మృత్యు ప్రబోధము' మొదలగు వానియందు సాత్వతియు జూడదగును ఇది మిక్కిలి ప్రశంసనీయము ఇందు బదునాఱు విషయములుండుటచే దీనిని 'చంద్రకళ' యని చెప్పవచ్చును.

శ్రీనివాసరావు గారి కవిత యం'దొక యనిర్వచనీయ మహోన్నతమగు హాయి' యున్నది 'దరులొరసి పారు గాంగ నిర్ఝరిణి యట్లు' వీరిగీతి (చెంగుచెంగున) తురంగలించును కవిత్వమునందు మంచి యుత్సాహ మున్నది.

మా కవితా సమితి గ్రంథావళిలో 'ప్రభవ' ప్రథమకుసుమముగ వికసించినది ఆంధ్రమహాజనుల మన్ననల కిది యెట్లు పాత్ర మగునదియు ముందు ముందు చూడవలయును

విశాఖపట్టణము
24-4-1928

**పురిపండా అప్పలస్వామి**
కవితా సమితి కార్యదర్శి

# ప్ర
# భ
# వ



ప్రకృతి గీతములు
ప్రణయ గీతములు
ప్రకీర్ణ గీతములు



శ్రీ శ్రీ జననం - 30 04 1910

శ్రీ శ్రీ మరణం - 15.06.1983

# 1. ప్రకృతి గీతములు

## స్వేచ్ఛ

ఆ మహోన్నత దివ్య వృక్షాగ్రమందు
నూత్న చైతన్య రాగ సన్నుతములగుచుఁ
గదలి యాడెడు పత్ర సంఘముల నడుమ
నేను సైత మొక్కాకునై యెనయుదేని

అన్నిటి విధాన జీవించి యున్న కాల
మాట పాటలతోఁ బూర్తియైన వెనుకఁ
గళలఁ గోల్పడి, కలుషపంకమునఁ జిక్కి,
క్రిందబడి పాంథజనుల త్రొక్కిళుల స్రుక్కి

ప్రకృతి యాగారమున నశింపంగఁబోక -
గాలి యొసఁగెడు క్రొత్త ఱెక్కల ధరించి,
అతి నిరాఘాటముగ విహాయస పథాల
నెఱుక పడరాని యెచటికో ఎగసిపోదు!

*ముద్రణ సుభాషి (మాసపత్రిక) నవంబరు 1927*

## మేఘ శకలము

ఈ ప్రకృతి గాఢ రాహస్య మెఱుఁగలేక
చంచల మనస్కతఁ బరిభ్రమించు నాకు
విశ్వ పథముల నడయాడి వేసరిలుట
యన్ని విధముల భావ్యమే యగును గాని -
ఓ వలాహక శకలమా! నీవు కూడ
నావలెఁ బరిభ్రమించుచున్నా వదేల?

నీ ప్రభావము, నీ శక్తి, నీ నియుక్తి
నీ వెఱుఁగలేక భ్రమయుచున్నావు గాని
తత సమస్త ప్రభావ నిధాన వితతి
కలదు నీ యందుననె యసంఖ్యాకముగఁ

ఒక సమయమందు శక్తి సంయుక్తి నెనసి
నీవెకా నిస్తులోన్నిద్ర నియత కాంతి
రాశివై, భువనత్రయారాధ్యుఁడైన
భాను సంతతి భాస్వత్ప్రభావయుతుని

మఱుగు పరతు వనాయాస కరనిరూఢి!
నీ ప్రభావము, నీ శక్తినీ నియుక్తి
నీ వెఱుఁగలేక భ్రమయుచున్నావు గాని
నీవు మహిత ప్రభా సమన్వితము కావె!

ఒక సమయమందుఁ బ్రబల సంయుక్తి నెనసి
తీక్షణ శక్తులతో సముద్రిక్త విలయ
కాల ఝంఝూమరుద్వీచికలు సెలంగ.
భీషణ శతఘ్నికావినిర్ఘోష సదృశ

సింహనాద మొనర్చుచు, స్థిరనిరంత
వారి ధారలఁ గురియించు వైభవంబు
నీ ప్రభావము కాదె! నీ నియతి కాదె
నీవు మహితప్రభా సమన్వితముగావె!

ఒక సమయమందు లీలాభియుక్తి మెఱసి
సాంధ్యరాగ ప్రభాంకుర చ్ఛాయలందు
వివిధ వర్ణ సముజ్జ్వల విభవ మంది,
విమల సంతోషభావ సంవృత్తి నెసఁగి

వినుతగతుల విహాయస వీథులందు
దాండవించెడు సమధికోత్సాహశక్తి
నీ నిధానము కాదె! నీ నియతి కాదె!
నీ విటు పరిభ్రమించుచున్నా విఁదేల?

చంచల మనస్కత, బరిభ్రమించు నేను
నిన్నుఁ బోలితిఁ గాని యత్యున్నత ప్ర
భావ సంపన్నిరూఢ వైభవములందు
నిన్నుఁ బోలిన ధన్యుండనే -

# ప్రకృతిగీత

మాధురీ మోహనం బిది! మసృణ కుసుమ
వాసనా వాసితం బిది! వైభవ ప్ర
భావ బంధుర బహుతర ప్రభల కెల్ల
ఆటపట్టిది! ఇచట నే నాడు కొందు!

దివ్యానందమయ ప్రపంచ మిట మూర్తీభావముం దాల్చి నా
కవ్యాజప్రణయాతిరేకమునఁ దానై స్వాగతం బిచ్చెడున్!
నవ్యం బీ ప్రకృతీలలామ మృదుకంఠం బిందు మద్గీతికా
కావ్యస్రజ్నివహంబుఁ గూర్చెద నలంకార ప్రభా స్ఫూర్తితోన్!

ఇది మనోజ్ఞ ప్రకృతిధామ మిచటఁ జేరి,
అమృతపేశల నవ మాధురిమముఁ గూర్చు
విహగ కలకూజిత ధ్వనీ విధములందు
స్వీయ కంఠారవము మేళవించుకొందు!

అత్యంత ప్రమదప్రదం బగుచు నత్యాశ్చర్యముం గూర్చు నీ
ప్రత్యూష స్ఫురదభ్రమండల విభావై చిత్రముం గాంచి, ప్రా
కృత్యారాధ్య మహాద్భుత ప్రతిభకున్ హృష్టాంతరంగుండనై
నృత్యక్రీడలఁ దేలిపోదు నను నేనే విస్మృతిం జెందుచున్!

ఇది నవోజ్జ్వల మమృతరసైక మధుర
మిది మనోహర మానంద సదన మిద్ది!
ఈ ప్రకృతి గర్భకుహర కాంతి ప్రసార
వీచికా మార్దవమునకు వివశమతిని!

స్పష్ట ప్రేమ రసార్ద్ర వీచికల నశ్రాంతంబుఁ దేలించు నీ
సృష్టి ప్రాభవమూర్తికిన్ హృది సమర్పింతున్ గృపామాధురీ
వృష్టిం జిందెడు దేవిగాఁ బ్రకృతిమూర్తిం గాంచి యర్పించెదన్
సాష్టాంగప్రణతుల్ నిరంతరము సాహస్రాతిరేకంబుగన్.

## అభిలాష

మామక స్వాంత సంభవిత దురిత
భయద చింతాధ్వాంత పటల నిర్దళన
చటుల ప్రతాప విస్తారంబులనుచు
నాశింతు నీ మందహాస దీధితుల

భవదీయ హృదయ భూభాగ ప్రవహిత
వాంఛా సలిల పూర వర్ధిత ప్రణయ
బీజము ల్మహనీయు వృక్షరూపమున
విభవాన్వితములు కా నభిలషించెదను

అధరాబ్జ సుమధురరస పాన
ముదిత మత్త మిళింద మూర్తి నొనర్చి
లలిత తనూ పరీరంభ దానమున
నలయించి వెలయింప నభిలషించెదను

*ముద్రణ ఆంధ్రభారతి మాసపత్రిక*
*సంపుటి 2, సంచిక 2, మే 1927*
*సంపాదకుడు తల్లాప్రగడ రామారావు*

## మయూర నర్తనము

అమల శిఖా మయూఖము లనంత విభోజ్జ్వల సాంధ్యరాగ ర
క్తిమమును గేలిసేయ నతిదివ్య సుఖోత్సవదాయివిలస
త్సుమద వనాంతర స్థల విరాజిత రమ్య సరస్తటంబులన్
సమద విలాసవైఖరుల సంపద లీనుచు దాండవింపుమా!

అనితరసాధ్య రూప విభవాతిశయంబున బొల్చు గర్వరే
ఖను వెలిబుచ్చుచుండెడు వికాసము లెల్లెడఁ దేజరిల్లఁగా
వనమున కెల్లఁ బూజ్యతర భావముచే నభిషిక్త సార్వభౌ
మునిగతిఁ జిద్విలాసములఁ బొల్చగు రీతుల నాట్య మాడుమా!

జలదములఁగాంచి సంతోష జలధిఁ దేలి
యతిమనోహర గతి నాట్యమాడునపుడు
నీ నవోన్మేష రోచిర్వితాన మలరుఁ
బ్రమద వనమున సూర్యోదయము విధాన!

నెలకొని నిల్చు నెద్దియొ యనిర్వచనీయ సుఖానుభూతి నీ
వలస గతుల్ రహింపఁగ వనాంతర వీథులఁ దాండవించినన్
గలిత సురూప సంపదలఁ గల్గిన వారిని గాంచినంత ని
ట్లలరుఁ గదా మనోహరతరామలభావము వారి యందునన్

నీ నముదగ్ర నాట్యము ననేకులు గాంచి యనంత హర్ష సం
వాసిత మానసంబుల సెబాసని మెచ్చిరి గాని నీ కరో
రాసహరావమున్ వినిన యంతట వారికి రోఁతపుట్టె న
య్యో! సరికావె కూఁతలు మహోద్ధత తావక లాస్యపాళికిన్!

సురుచిర రూపసంపదల సొంపు లొసంగి యొసంగఁడయ్యె మా
ధురి జిలికించు సుస్వరము ధూర్తుఁడు దేవుఁడటంచు నెంచరా
దరయగ నుర్వి నిట్లె కననౌను గుణమ్మొట నున్న నచ్చటం
బరగెడు దుర్గుణంబు గుణమాత్రమె మెత్తురు మానవోత్తముల్.

## రజనీ గానము

వివిధ సూన వితాన శోభిత కుజ ప్ర
శస్త సుప్రమదావన స్థలము సాంద్ర
చంద్రికాసముజ్జ్వల దివ్య శర్వరీ ప్ర
శాంతవేళ సమంచిత సౌఖ్య మొసఁగె!!

మైమరచిపోతి నంత సమస్త భువన
సముదయ మలర్చె నపుడె విస్తార మధుర
గాన నిస్వన కల్లోల కలిత లలిత
భావ కవితా వియద్వాహినీ విధాన!

ఆ వినూతనోత్సాహదాయక మనోజ్ఞ
సమయ సంజనితాధిక సంభ్రమమున
సృష్టి సౌభాగ్య విభవ వైచిత్రిఁ గాంచి
పరవశత నొంది గొంతెత్తి పాడుకొంటి!

ప్రవిమలామృత రస పరిప్లావితాభ్ర
ధామ సందీప్త పూర్ణ సుధానిధిఁ గని,
నర్తన మొనర్చునాఁడ గాన ప్రవంతి
కా నవీన తరంగావగాహి నగుచు!

ఈఁదుకొని పోతి మామక హృదయ కుహర
జనిత భావ నౌకాధిరోహణ మొనర్చి,
కంధర తరంగ నివహ సంకలిత మహిత
గగన సాగర గంభీర గర్భ మందు!

*ముద్రణ ఆంధ్రభారతి నవంబరు 1927*
*పునర్ముద్రణ . భారతి - డిసెంబరు 1927*

## మాతృగీతి

ఈ యుషః ప్రస్ఫురద్రమణీయవేళ
నవ వికస్వర మృదులతాంతముల యందు
నాకుఁ దోఁచెను ప్రకృతి కాంతా శరీర
సౌరభాకృష్ట మధుర సంస్పర్శ సుఖము!

మంజుల సమీరణోర్మికా మర్మర ధ్వ
నీ మిషమ్మునఁ బ్రకృతి యోషా మృదూక్తు
లమృత నిభముగ హర్షదాయకములయ్యె
రసపిపాసాతుర హృదంతరాళమునకు!

ఉరు మహీధర సాను నిర్ఝరనికాయ
నిర్మలాంబు ప్రవాహ నిర్నిద్రవృత్తి
విలసనమ్ములఁ బ్రకృతీదేవీ ప్రహృష్ట
హృత్ప్రపూర్ణానురాగవాహినిగఁ దోచె!

# సముద్ర ఘోషము

ఈ నిరాఘాట దేదీప్యమాన కాంతి
సంతతుల మధ్యమున నిరభ్యంతరముగ
నే వెలిఁగి పోదు - నా మహా నినదములకుఁ
గాల గర్భ ప్రతిధ్వాన గతులు వచ్చు!

నే నొక విశాల రాజ్యలక్ష్మీ నృపాల
పద మధిష్ఠింతు! నా రాజ్యపాలనమున
నిరత ముదయించు నిర్ఘోష నిచయమందు
మామకాజ్ఞా ప్రణాళిక ల్మలయుచుండు!
నే ననుగ్రహ నిగ్రహ జ్ఞానమతిని!

నా కనారత మానంద శోక గతులు
కలుగుచుండును నాకింత తెలియరాక!
నా చరిత్రము నాకె యన్వయము కాదు

నేను దుఃఖింతు మానవాజ్ఞానమునకు;
నేను హర్షింతు మానవ జ్ఞానమునకు!
అఖిల మనుజ దుఃఖ ప్రమోదాశ్రు సలిల
ధార భరియింతు క్షార డిండీర రుచుల!

అస్మదీయ ప్రమోద ఘోషారవమున
నవ్య గాన నినాదముల్ శ్రావ్యములగు!
మామకీన ప్రచండతరామనస్య
భర రవమునందు గద్గదస్వరము దోఁచు!

నా నిజప్రజ్ఞ శూన్యము! నే నపూర్వ
మానవాతీత తేజః క్రమ ప్రతీత
శక్తి గల్గిన చండశాసనుఁడ నిజము!
కాని నన్ను సృజించి నా గతులు నడుపు
ఘనుఁ డతీతతరుం డొఁకొక్కరుఁడు కలఁడు!

ముద్రణ ఆంధ్రభారతి మాస పత్రిక
సంపుటి 2 సంచిక 12 మార్చి 1928
సంపాదకుడు : తల్లా ప్రగడ రామారావు

# మృత్యు ప్రబోధము

ఓయి మనుజుఁడ! నీ నిస్పృహాయ దీన
హీన దుస్థితి గతుల నూహింపలేక
నన్నుఁ బ్రతారింప వ్యర్థ యత్నము లొనర్చి
నా కనుల ముందె తిరుగుచున్నావు గాని
ఎఱుఁగవే నన్ను లోక భీకర మహోగ్ర
ఫణి విషస్ఫీత మృత్యు రూపిణిగ నీవు?
నీ హృదంతర సదన సంస్థిత కరాళ
శిఖి శిఖాచ్ఛట నని గ్రహించెదవొ లేదొ?
భీప్రద క్రకచోగ్ర దంష్ట్రా ప్రభూత
విస్ఫుర త్తేజమున దాండవించు నన్ను
మృత్యుదేవతగా మది నెఱుఁగలేవొ?

కనుఁగొనగదోయి! భావలోచనముఁ దెఱచి
మామకీన ప్రచండ తేజోమహత్త్వ
మీ విషానల కీలా ప్రభావదగ్ధ
మై సమస్తము నడఁగు సృష్ట్యాదినుండి!
ఈ మదీయ కరాళ జిహ్వికల యందు
జీవసముదయ మెపుడైనఁ జిక్కవలయు!
ఈ విషానల ధూమరేఖావృత మయి
కుందు జీవాళి కదియె వైకుంఠపథము!

దివ్యతేజస్సముజ్జ్వల త్రిభువనాంత
రాళ తలమె మదీయ నాట్యాలయమ్ము!
నా ప్రళయ తాండవమున జీవప్రకాండ
హృదయ తంత్రులె నినదించు నుదితగీతి!

నా కనులఁ బొల్చు సుప్రసన్న ప్రశాంత
హాసకాంతులె కురియించు నగ్నివృష్టి!
నా గళమునందు మేఘగర్జా గభీర
భయద నిర్ఘోషములు వినంబడుచునుండు!

నా గతులయందు చరమ సంధ్యా ప్రదీప్త
శోణవర్ణాభరక్తరోచులు స్ఫురించు!
నా ప్రభావ ప్రతాప విన్యాసగరిమ
సర్వలోకైక చండశాసన చణమ్ము!
నా మహాద్భుతశక్తి నింతగ నెఱింగి
తావక స్వార్థ దుర్గుణ ధ్వాంత పటలి
దొలఁగఁ ద్రోయుచు నీకనైన దెలివి గనుము!



ఎడమనుంచి: పురిపండా, శ్రీ శ్రీ, వడ్డాది సీతారామాంజనేయులు

# 2. ప్రణయగీతములు

## అభిసారిక

ఈ నిశీథిని ప్రబల ఝుంఝూనిల ప్ర
సార విదళిత వృక్ష సంచయ కలితము!
కులిశ ఘాత ప్రతారణ కుశల కుధర
వజ్ర్కసన్నిభ ఘన పయో వాహయుతము!
ఘనఘోంతర విచ్ఛిన్న భూరి తిమిర
పటల తీవ్ర భయ ప్రతిపాదకంబు!
ధ్వాంత సంకీర్ణ గగన హృదయ విదీర్ణ
శక్తి యుక్త క్షణప్రభాసంయుతంబు!
చండ హర్యక్ష భయద గర్జాసమాన
కంధర ధ్వాన చకిత దిగ్దంతి యుతము!
మహిత వేదండ భల్లూక హరిసమూహ
ఘోరఘోరాతిఘోర నిర్ఘోష పాటి
తాఖిల జన శ్రవణ పుట మగుచుఁదనరు
విజనమగు విభ్రమాస్పద విపిన తలము

అయిన నేమాయె ప్రేమ మెంతైన జేయు!
దుర్గమ భయంకరారణ్య దుర్గములును,
ప్రళయకాల సమాన విభావరులును,
ప్రణయ రాజ్య రమా ప్రాణపతి కొఱకయి
తరలి యరిగెడు నా కవాంతరము లగునె!

*ముద్రణ భారతి జులై 1927*

## ప్రణయోద్రేకము

ఈ నిశీథిని ప్రబల ఝుంఝూనిల ప్ర
సార విదళిత వృక్షసంచయ కలితము!
కుళిశ ఘాత ప్రతారణ కుశల కుధర
పజ్ర్కసన్నిభ ఘన పయోవాహయుతము!

ఘూనఘోంతర విచ్ఛిన్న ఘూరి తిమిర
పటల తీవ్ర భయ ప్రతిపాదకంబు!
ధ్వాంత సంకీర్ణ గగన హృదయ విదీర్ణ
శక్తి యుక్త క్షణ ప్రభాసంయుతంబు!
చండ హర్యక్ష భయదగర్జా సమాన
కంధర ధ్వాన చకిత దిగ్దంతియుతము!
మహిత వేదండ తుండ ప్రముఖసలిల
సంతతైక ధారాపాత సంకలితము!
ఈ ప్రదేశ మమాన భయప్రదాన
శరభ వేదండ భల్లూక హరి సమూహ
ఘోర ఘోరాతి ఘోర నిర్ఘోష పాటి
తాఖిల జన శ్రవణపుట మగుచుఁ దనరు
విజనమగు విభ్రమాస్పద విపిన తలము

అయిన నేమాయె ప్రేమ మెంతైనఁ జేయు!
దుర్గమ భయంకరారణ్య దుర్గములును,
ప్రళయకాల సమాన విభావరులును,
ప్రణయరాజ్య రమా ప్రాణపతి కొఱకయి
తరలి యరిగెడు నా కవాంతరము లగునె!

## వియోగ వితర్కము

నవకుసుమ కోమల శరీర సవిరళ పతి
పద సరోజాత భక్తి తత్పర మనస్క
నిమ్మహాకానన ప్రదేశమ్ములందు
నక్కటా! యొంటి విడనాడి యరుగుటెట్లు?

రమ్యగీతికా శ్రవణ మాత్రమున విసువు
జెంది వివశమై పోవు నెచ్చెలి కఠోర
భయద గహన చరన్మృగార్భాటములకు
నెంత భీతిగలంగి దుఃఖింప గలదొ?

లలిత సుమదళ స్పర్శ మాత్రమున నొడలు
కడునవసి పోవ నెంతయు బడలెడు నతి
కఠిన కంటకాకీర్ణ దుర్గమ వనముల
నక్కటా! యేగతిన్ నడయాడ గలదొ?

ఇట నిలువఁజాల నింక! అన్నిటికి దేవ
దేవుడున్నాడు, భాస్వత్ప్రభావయుతుడు
లలన దమయంతిఁ గావగలాడతండె -
వెడలి పోయెద వడిగ నీ యడవి విడిచి

## వియోగశాంతి

అక్కటా! ఈ వియోగాగ్ని యతిశయించి
కాల్చెడిని మామకీ నాంగకములనెల్ల!
కాఱుచున్న యనంతాశ్రు కణములందు
స్నాన మొనరింతుఁ దాప ప్రశాంతి కొఱకు!

అంతమే లేని ఈ విరహాంబురాశి
ముంచుచున్నది తనువెల్లఁ బొంగిపొరలి!
దీనిఁ బూనికఁ బూని మథించి తుదకుఁ
బడసెద ననంత సుఖ స్వాదురసము!

అతి భయంకర విరహ గాఢాంధకార
మలము కొనెడిని నా హృదయాంతరమున!
'అయిన నరసెదనిట నీ సహస్ర కిరణ
మాలికా దివ్యదేదీప్యమాన కాంతి!

*ముద్రణ ఆంధ్రభారతి మాసపత్రిక, ఆగస్టు 1927*
*సంపుటి 2 సంచిక 5*
*మచిలీ పట్టణము*
*సంపాదకుడు · తల్లా ప్రగడ రామారావు*

*ప్రణయోద్రేకము, వియోగవితర్కము, ' వియోగశాంతి -*
*ఈ మూడూ కలిపి ప్రణయ ప్రపంచం పేరుతో అచ్చువేశారు*

# ప్రభాతగానము

అస్మదీయ ప్రఫుల్ల హృదంతరాళ
సంస్థిత పవిత్రతర భావ సముదయ ప్ర
దర్శనోత్సుకమతి నౌచుఁ దమక మెసగ
దేవ! నీ సన్నిధికి నేగుదెంచినాఁడ!

అత్యుదగ్ర తమిస్ర దుర్వ్యాపృతి ప్ర
భిన్నమానైక శక్తిసంపన్న నిశిత
భానుకిరణ ప్రశస్తమై ప్రాచి దోఁచె!
సమయ మయ్యెను నీ పూజ సలుపుకొఱకు.

ఏ యనంత ప్రభావ దుర్జేయమాన
మానితాచ్ఛ పరంజ్యోతివో, నితాంత
నిస్తుల గుణాబ్ధివో అట్టి నిన్ననంగఁ
గందళించిన హృదయారవింద సుమము
భక్తిపూర్వకముగ సమర్పణ మొనర్తు!

మహిత భవదీయ రూప సంపద్విలాస
నిర్మలాంచిత మందాకినీ తరంగ
సమవగాహనోపార్జిత విమల పుణ్య
మహిమకారణ గళిత కల్మషుఁడనైతి!
నిమిషకాలము నిన్ను ధ్యానింపనిమ్ము :

దీర్ఘ హర్షప్రదాయక దివ్య భావ
గీతికా నవ్యరాగ సంకీర్తనమున
నైక్య మయ్యెదఁ ద్వన్మనోహర దిగంత
విశ్రుత శ్లోక పరిశుభ్ర వీచికలను!

*ముద్రణ భారతి - 1928 జూన్*
*పునర్ముద్రణ ఆనంద భారతి*
*కథల మాస పత్రిక*
*సంపుటి 1 సంచిక 1 ఏప్రిల్ 1929*

# నిరీక్షణము

ఈ సముజ్జ్వల రజనీ విలాస పథము
లనుగమించుచుఁ గుంజ కుంజాంతరములఁ
దావకీన సురూప సందర్శనాశ
కడలుకొనఁగ నదే పనిగా వెదకితి!

ఈ నిరర్థ గవేషణావృత మదీయ
భావ వీథులు నిస్పృహతావిషాద
కలిత గాఢాంధకార పంకిలము లగుచు
నన్ను నా కతి దూర మొనర్చి వైచు!

అపుడు శాంతి లేశము సైత మంతరింప
నతి నిరాశను నా నయనాంబుదములు
దిక్కు దిక్కుల గరుణార్ద్ర దృష్టులంపి
రిక్త బాష్పాంబుధార వర్షింపఁ దొడఁగు!

చిర వియోగాగ్ని కీలా విశీర్ణ మగుచు
ననవరతము విషణ్ణ గీతారవమున
మానసము బాహ్యవిశ్వమ్ము మరచిపోయి
కడు దపించును వడవడ వడకి వడకి
అతి పవిత్ర ప్రపూజ్య మన్యోన్య హృదయ
దీప్తమని మన ప్రేమను దెలియఁగలిగి
ప్రబల కష్ట పరంపరల్ ప్రతిఘటించి
నిల్చిపోయితి నీకయి నేఁటివఱకు!
ఈ నిరీక్షణ పరిణామ మేమి యగునొ?

# 3. ప్రకీర్ణ గీతములు

## ప్రళయ నర్తనము

సాయం ప్రస్ఫుట రాగరంజిత లసత్సంపూర్ణ సౌందర్య రా
శీయుక్తామల దివ్యమూర్తివయి, సాక్షీభూత నానామరు
త్తోయస్తోత్ర గభీర గానరస సంతుష్టాంతరంగంబునన్
మాయామేయ జగద్వినాశనమతిన్ నర్తింపుమా! శంకరా!

అలఘు ధ్వాంత వితాన సంభరిత రోదోంతర్మహాగహ్వర
స్థలి యంభోనిధి యయ్యె సంతత జలస్రావాతిరేకంబునన్
విలయాంభోధర ఘోష సమ్మిళిత గంభీరాట్టహాస ధ్వనీ
చలిత ప్రాకట దిగ్గజాండ వగుచున్ సంప్రీతి నర్తింపుమా!

కాలాంతప్రభవార్కకోటి ఘృణి సంకాశ ప్రతాప స్ఫుర
త్ఫాలాక్ష జ్వాలదగ్ని దగ్ధ సకల బ్రహ్మాండ భాండుండవై,
జ్వాలాదీప్త మహా ప్రభావ గరిమన్ స్వచ్ఛంద సంవర్తకే
ళీ లోలాత్ముఁడవై, సమస్త జగముల్ కీర్తింప నర్తింపుమా!

*ముద్రణ భారతి - సెప్టెంబరు 1927*
*పునర్ముద్రణ కవిత మాసపత్రిక మే, జూన్ 1928*

## గీత పద్యాలు

పద్యములు - ముఖ్యముగ గీతపద్యము లవె
యొసగు నింతింత కాని సంతసము నాకు!
వేళపాళయు లేక యెవ్వేళలందు
గీతములు వ్రాసి గీపెట్టి కేకలిడుచు
మరల మరల మంజుల గాన ఝరుల దేలి
నాట్యమాడుట మాత్రమే నా కొక పని!

ఒక యనిర్వచనీయ మహోన్నతమగు
హాయి యున్నది గీతపద్యముల యందు!
దరు లొరసి పారు గాంగ నిర్ఝరిణి కరణి
చెంగు చెంగున గీతి తురంగలించు.

పద్యములు - ముఖ్యముగ గీతపద్యములు ర
చించి, హర్షించి, పాడి, నర్తించి మించి
పిదప - వ్రాసిన పద్యాల నెదియొ యొక్క
పత్రికకు బంపుటే నాకు బని - నిరంత
రమ్ము వ్రాయుదు నింత విశ్రాంతి లేక
పద్యములు ముఖ్యముగ గీతపద్యములవె
యొసఁగు నింతింత కాని సంతసము నాకు!

ఆధునిక దివ్యఖండకావ్యముల యందు
బ్రాణ సన్నిభమై గీతి పరుగులాడు!
విస్తృత వనాంతరోదగ్ర వీథులందుఁ
గ్రేళ్లఱుకు లేడి వలె గీతి త్రుళ్లులాడు!

పద్యములు - ముఖ్యముగ గీతపద్యములు ర
చించి, కీర్తించి, పూజించి, ఎంచరాని
ఆ మహోన్నత గీత వితానములను
సంతతము సంతసిలి విహరింతు నేను!

## అంతిమ యాత్ర

ఈ యవసథమందున వసి
యించుటయే సతతము నా
కవసరమని యనుకొని నే
నాశించితినా?

కడపితి నిన్నాళ్ళుచటఁ
గాలమ్ము నిరర్థకముగ
విఱిగి పడిన గృహమున జీ
విత మిఁక నేలా?

ఎఱుఁగుదు మఱి యొక్క మనో
హరతర గేహము కలదని!
అచట నిన్ను దర్శింపఁగ
ననుమతి లేదా?

ఈ శుష్కావసథమ్మున
నిరులొరసెడు దెరతెరలై
అచ్చట నెచ్చట గనిన మ
హా తేజస్సే!

ఏ మూలలఁ గనిన నపా
రామనస్యమే ఇచ్చట!
అతుల బ్రహ్మానందం
బలరెడు నచటన్!

ఇచటఁ గరాళించెడు న
న్నెదియో అవ్యక్తశక్తి!
నను గొని పొమ్మా స్వస్థా
నమునకుఁ ద్వరగన్

చిందఱ వందఱలుగనై
చిందిన జ్యోతి శ్శకలము
లేక మహాతేజస్సున
నే కలియుఁ గదా

వికసిత హృదయ ప్రభూత
వివిధ రసావేశములు మ
హానంద బ్రహ్మమ్మున
లీన మగు గదా!

## మత స్వీకృతి

1

హైందవ మహమ్మదీయ హృన్మందిరముల
నైకమత్యానుభావ సౌహార్ద సద్మ
ణాదికములను నెలకొల్పి యతుల విభవుఁ
డైన యక్బరు పాలనం బంతరించె

సంతతోత్సాహకలిత వసంతు డగుచు
జనుల కెల్లర కానందమును ఘటించి
కీర్తిఁజెందిన యల జహంగీరునాఁటి
శాంత పరిపాలనా విధుల్ సమసిపోయె.

ప్రాక్పతీచ్య శిల్పాచార్య బంధుర ప్ర
భావ సమ్మేళనమ్మున బాటబాట
లెల్ల శిల్ప విస్ఫూర్తి వేనోళ్ళఁ జాటు
షాజహానుని కాలమ్ము చల్లపడియె.

నాఁటి సౌహార్ద సద్గుణౌన్నత్య శక్తి,
నాఁటి సదమల శాంతి సౌందర్య గరిమ,
నాఁటి 'లలిత' కళా నిరాఘాట పటిమ
కలయ వెదకిన నెందును గానరావు

అది మదోన్మత్త వేదండ సదృశ విహర
ణాప్తి నౌరంగజేబు నిరంకుశముగ
భారత క్షితి నవ్య కహ్లార సరసిఁ
గలఁత నొందించిన విషాదకర సమయము.

పూర్వ రాజన్య పాలనాస్ఫూర్తిఁ దవిలి
అతి సుఖంబుల నందిన హైందవులకు
దినకర మనోజ్ఞ కిరణ సందీప్తి యడఁగి
కల్గినట్లయ్యె నప్పుడు కాళరాత్రి.

క్రూర పరిపాలనమున సంక్షోభ మంది
భూప్రజలు మలమల మాడి పోవుచుండ
నెచటఁ గనినను రోదన ప్రచలితమగు
హైందవ కుటుంబ దుఃఖాశ్రు లలమికొనియె.

వెనుక దినముల భారతోర్వీస్థలమున
బుట్టువొందుట యొక గొప్ప పుణ్యమయ్యె;
కటకటా! నాఁడు భారతఖండమందు
హిందువుని జన్మ మత్యంత హీనమయ్యె.

భరత పుత్రుల గాసిలపఱిచి, మరలఁ
బ్రాఁత తల పన్ను వారలపై విధించి,
నిరత మెన్నెన్ని విధుల దండించియైన
దృష్టి యనుమాట పాదుషా తెలియఁడయ్యె

అపుడు మత మను పేరిట ననగరాని
యష్ట కష్టములను బెట్టి హైందవులను
స్వీయ మతధారణ మొనర్పఁజేయు కొఱకు
దారుణ క్రియ లొనరింప దలఁచె నతఁడు

నిజమత ప్రోక్త మిది యని నిశ్చయించి,
అన్యమతముల నన్నిటి నడఁగఁద్రొక్కి,
స్థిరత నిస్లాము మతము వర్ధింపుఁ డనుచు
నపు డలంఘిరు సేనల కాజ్ఞ యొసఁగె.

అదియె తడవుగ పడిగ మహమ్మదీయ
సైన్యవారము నిర్భీత శక్తి నెనసి
నిజమతమ్మును నెలకొల్పు నెపము మీఁద
భరతభూమినిఁ జీకాకు పఱిచి చెఱిచె!

నాఁడు హైందవ రుధిరమ్ము నల్లడలను
గాంగతటినీ ప్రవాహ సంకాశ మయ్యె
నాఁడు హైందవజన రోదన స్వనమ్ము
భూ నభోంతరముల మాఱు మ్రోఁగఁ దొడఁగె.

మతము నందలి గట్టి నమ్మకము చేత
హిందువులు ప్రాణములనైన నిచ్చినారు;
మతము నందలి గట్టి నమ్మకము చేతఁ
దురకలును హిందువులఁ జంపఁ దొడగినారు.

నిజమతాభి నివేశ నిర్నిద్రు లగుచు
నపుడు తురక లొనర్చిన యట్టహాస
ఘోషముల కెందు వెదకినఁ గొదవలేదు!
ఘోరముల కెందు వెదకినఁ గొఱతలేదు!

ఆ నిరాఘాట సంఘట్టనాగ్నియందు
నతి దురంత వ్యథాక్లిన్న హైందవజన
శత సహస్రాధిక ప్రాణ పమిధ లెల్ల
నొక్కపరి బగ్గుమని మండి యూరకుండె!

2

నిర్మల మనోజ్ఞ మందాకినీ ప్రశాంత
ధవళ వీచిక లెచ్చోటఁ దఱిసి పాఱు
నది యనన్య మనుష్య విహార భూమి
నవనవాజ్ఞాత మధుర కాంతారవీథి!

ఆ శుభోత్సవ దివ్య ప్రదేశమందుఁ
బ్రకృతి లక్ష్మికి స్వాగతాభ్యర్చనమున
బ్రత్యహజ్వల దరుణ గభస్తి చయము
నిరత నిరవధి కానంద నియతిఁ గూర్చు.

వితత లీలావిలాస ప్రవృత్తిఁ దనరి
అచట విహరించు వివిధ విహంగమములు
కలకలావర సంక్షోభకారణమున
నచటి నిశ్శబ్ద భావము నపనయించు

ఆ మనోహర కాంతార భూములందు
బ్రతి దినాంత ప్రదోష ప్రభాపటలము
ప్రవిమల నదీ జలంబుల ప్రతిఫలించి
స్వర్ణ నీర ప్రకార విభ్రాంతిఁ గూర్చు

స్వైర విహరణ దీక్షా ప్రసక్తిఁ దనరి
అతి పిపాసను జనుదెంచు హరిణ సమితి
ప్రతికురంగమ రూప బింబమును గాంచి
త్రాసభరమున నీటినిఁ ద్రావమాను.

ఆ సముజ్జ్వల శాంత దివ్యస్థలమున
ఆ మనోజ్ఞ నదీతీర భూములందు
బర్ణ కల్పిత కుట్టిమాభ్యంతరమున
వాసముండెడు 'యదు నాథ వసు' వొకండు

బ్రహ్మతేజో మహత్తర ప్రాభవమున
జ్ఞాన సంభృత హృద్వికాసము వహించి,
జాహ్నవీతీర సంస్థిత శాంతమూర్తి
భక్తి బంధుర గీతముల్ పాడుచుండు.

ఆర్యతేజః ప్రభావ గానామృతమున
గృష్ణలీలా చరిత్ర సంకీర్తనమునఁ
గంఠనిర్గత రవళి గద్గదిక మెనయఁ
బరవశత్వము నొంది పైమఱచు నతఁడు

అతఁడు హైందవ వీర మహాద్భుత ప్ర
వర్తనామూల్య రాగాలాపన మొనర్చు
సమయమం దశ్రు బిందూత్కరములు వెడలి
గాంగ నిశ్చల సలిల సంఘములఁ గలియు

భరత రమణీ మహోత్కృష్ట చరితములను,
భారత ప్రాక్తన గరిష్ఠ వైభవమును
దనివి తీఱక సతముఁ గీర్తన మొనర్చి,
కడపు జీవిత నాటకాంకముల నతఁడు

3

అది మనోజ్ఞ ప్రశాంత దినాగమనము,
ప్రకృతి నెల్లెడ హర్ష వీచికలు వీచె!
కమల మంజుల మందిరాంగణములందు
సమద బంభర గాన ఘోషలు నదించె!

అపు డనంత ప్రమోద భరాప్తి జనిత
నవ నవోత్సాహమున యదు నాథ వసువు
ప్రత్యుషః పవనాంకుర ప్రతతులందుఁ
గీర్తన నినాదమును తరంగిత మొనర్చె

ఆ సమయమందు గంగానదీ సమీర
చలిత వీచులు నాట్య విద్యల నటింప,
మాధురీ మౌగ్ధ్యమున యదునాథ వసువు
పాడె నిట్టుల గంభీర భావగీతి.

"భయద విరహానల
ప్రబల తీక్ష్ణతయందు
జీవనంబే ఇంకి
పోవునని భయమయ్యె!

ఓ ప్రేమ వారాన్నిధీ!
దీనునకు
నీ ప్రాపుఁ జేకూర్చుమా!

★ ★ ★

అంధతమస్సంక్రాంత ని
రర్థక జీవిత పథముల
శారద రజనీ జ్యోత్స్నా
కారా! కనఁబడవేరా!

హాలాహల కీలా ని
ర్వేల ప్రాపంచాంబుధి
నో కారుణ్యామృత మూ
ర్తీ! కానంబడవేరా?

★ ★ ★

దేదీప్యమాన దీ
ధితుల కంధుండనై
నా మది నిరంతరము
నడయాడు హృదయేశుఁ
గనుఁగొనఁగ లేకుంటచే
ఇది వియో
గ వ్యథగ నూహించితిన్

ఇది వియోగానర్హ
విభు సమాగమ కాల
మిది విచారానర్హ
మధుర హర్షణ వేళ
భావదర్పణ మందునన్
శ్రీమూర్తి
ప్రతిబింబితుం డయ్యెగా!

ఆ ప్రసన్న ప్రశాంత దినాగమమున
ఆ మనోహర భావగీతామృతముల
తీయదనమున భాగీరథీ మనోజ్ఞ
వీచికా సంతతులు తలలూచి మెచ్చె

తన్మయానంద రస మహోత్సాహి యగుచు
మాధురీ మౌగ్ధ్యమున యదునాథ వసువు
ప్రార్థనాత్మక గీతము ల్పాడు వేళఁ
బుష్ప సంతతు లానందమున హసించె!

ఆ వినిర్మల శాంత గీతా విరావ
మాలకించి యనంత హర్షాప్తి నొంది
పరిసర స్థిత భూరుహ పత్ర వితతి
సాంద్ర నీహార హర్ష బాష్పముల రాల్చె

★ ★ ★

అపుడు తలఁపని తలఁపుగ నన్ని దిశలు
ఘోర భీషణ ఘోష సంకులము లయ్యె,
అపుడు యవన చమూసమూహాంబు రాశి
యమ భటఘటా హరా దాగమముగఁ బర్వె.

వారిఁ గొంచక యదునాథ వసు వసంత
భక్తి భావ ప్రభావ సంపద వహించి,
నిశ్చల ధ్యాన దీక్షా ప్రణీతుఁ డగుచు
బాడఁ దొడఁగెను గంభీర భావ గీతి

క్రాఁగుచుండు నయః పాత్రికల నపూర్వ
శీతల తుషార బిందువుల్ చిలికినట్లు
క్రమ సత్ప్రార్థనామేయ గాన రవళి
యవన సైన్య జనాగ్నికి నాజ్యమయ్యె.

జలధర మహోగ్ర ఘోషాప్రచండ నినద
మష్ట కకుబంత ముఖరితంబై ధ్వనింప
నిజమతాభినివేశ నిర్నిద్ర యవన
భట మహత్తరుఁడొక్కఁడు పలికె నిట్లు.

"ఇది యనన్య జనోల్లంఘనీయ భరత
చక్రవర్తి ప్రకల్పిత శాసనమ్ము!
ప్రాణముల నొసంగెదవొ? మహమ్మదీయ
మతముఁ గొనియెదొ? మఱిమఱు మాట వలదు"

ఆ గభీర వినిర్ఘోష మాలకించి
మది నొకించుకయును జలింపకయ నిల్చి
మృదు మధుర మందహాస సంస్ఫూత వదన
వనజుఁడయ్యెను యదునాథవసు ఘనుండు!

అటుల నిశ్చలుఁడై, గరీయః ప్రభావ
శాంత చేతస్కుడై నిల్చి సౌమ్యగుణుఁడు
సాధు హృదయాంచితుఁడు యదునాథ వసువు
శృంఖలాబంధనమునకుఁ జేతులొసగె!

తన కరమ్ముల నట్లు బంధన మొనర్చు
సమయమందున వీణా ప్రసన్నగాన
నవ్య నిర్ఘోషమున యదునాథ వసువు
పలికె నిట్లు యధార్థ సంభాషణముల!

"మీ మతమ్మున నొక్కఁడనై మెలఁగుట
నాకు సమ్మతమగు నవాంతరము లేదు
మతము లన్నియు నాకు సమానములగు
నెందునైనను దేవు నూహింపఁ గలను!

మతము లన్నియు దైవ సమ్మతములగును,
మతము లన దైవ పూజకు మార్గము లగు!
ఏ మతమ్మున నున్న నాకేమి? నాకు
దైవపూజా ప్రణీత చిత్తంబు గలదు!

అన్నిమతముల యందున ననుసరింపఁ
దగిన నీతులు గలవు వందల కొలంది!
దోషములు మాని వరలు సద్గుణము మెచ్చి
యనుసరించెడు వాఁడె మహామహుండు!

ఆ నిరామయ సేవా మహావరమ్ము
చిరసమార్జిత పుణ్య విశేష ఫలము!
ఆ నిరంజన తేజో విలీన పదవి
బహుళ జన్మ సమార్జిత భాగ్యఫలము!

ఆ పరాత్పర దివ్యపాదారవింద
సేవకంటెను నా కన్య చింతలేదు!
ఆ సనాతను గానమ్ముఁ జేసికొనుచుఁ
బాపుకొనెద మదీయ జీవన భరమ్ము!"

*ముద్రణ ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక, 1928*

# 4. సమీక్ష

## 1

### ప్రభవ

గ్రంథకర్త శ్రీ శ్రీనివాసరావుగారు, కవితాసమితి, విశాఖపట్టణము,
క్రౌనుసైజున 54 పుటలు కలవు.

వెల రు. 0-8-0.

**ఇది** కవితాసమితి గ్రంథావళిలో మొదటిది. ఇందు ప్రకృతి గీతములు, ప్రణయ గీతములు, ప్రకీర్ణ గీతములు అను వేర్వేఱు విభాగముల పదునాఱు ఖండకావ్యములున్నవి. శైలియందు సార్థకతకంటె సమాసతత్పరత యెక్కువ గోచరించుచున్నది ఇంకను విషయానుగుణ్యముగ శైలియందు మార్పులు కన్పడవలెను తెనుగు వాడకము చాల తక్కువగ నున్నది ఒక్కొకచో బడలించు సమాసభూయిష్ఠత యున్నను మొత్తముమీద శైలి బాగుగనున్నది భావములందును గాంభీర్యమున్నది భావములకును, భాషకును సామరస్యము సంధించుట కీ కవి యింకను ప్రయత్నింపదగును. ఇది చదివినవారికి కాలక్రమమున ఈ కవి కవిత యింకను సంపన్నము కాగలదను ఆశ పొడమును. భావస్వాతంత్ర్యమును, భాషాసౌష్ఠవమును మెచ్చదగియున్నవి ప్రకృతి పథముల తత్త్వాన్వేషణము సలుప సమకట్టిన యీ కవికిశోరమానసము ఉత్సాహ రంజితమై యొప్పుచున్నది.

*- కొంపెల్ల జనార్దనరావు,*
*ముద్రణ భారతి - ఆగస్టు 1928*

## 2

ప్రభవ - కవితా సమితి గ్రంథావళి 1 మ శ్రీ శ్రీనివాసరావుగారిచే రచింప బడినది. ఇందుఁ బ్రకృతి గీతములు ప్రణయగీతములు ప్రకీర్ణ గీతములను మూడు భాగములు గలవు ప్రకృతి గీతములలో నెనిమిది ప్రణయ గీతములలో నాలుగు ప్రకీర్ణగీతములలో నాలుగును విషయములు గలవు ఇందలి ఖండకావ్యములు మనోహర వర్ణనలతో నిండియున్నవి వెల . 0-8-0

*ముద్రణ ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక -*
*1928 విభవనామ సంవత్సరం, శ్రావణభాద్రపద మాసములు*



శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి  శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు



రవీంద్రనాథ్ రాగూరుతో కవితా సమితిసభ్యులు10 2 1933

కూర్చున్నవారు  ఎడమనించి కుడికి

1 సెట్టి లక్ష్మీ నరసింహకవి 2 గొబ్బూరు వేంకటరాఘవానందరావు 3 పురిపండా అప్పలస్వామి 4 తెన్నేటివిశ్వనాథం 5. టాగూర్ 6. మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవిగారు) 7 సబ్బవీసు సత్యకేశవరావు 8 పరవస్తు లక్ష్మీ నరసింహస్వామి 9 ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ

నిల్చున్నవారు  ఎడమనించి కుడికి మొదటివరస

1 తెన్నేటి రామమూర్తి 2 తాపీ ధర్మారావు 3 విజిగుప్తా 4 పూడిపెద్ది వెంకటరమణయ్య 5 స్థానాపతి సత్యనారాయణశాస్త్రి 6 మొసలికంటి సంజీవరావు 7 ఆర్య సోమయాజుల సుబ్బారావు 8 రామమూర్తి శాస్త్రి 9 వెంపటి సత్యనారాయణ

2వ వరస

1 శ్రీ శ్రీ 2 తెలీదు 3 సున్నం వీర్రాజు 4 శ్రీరంగం నారాయణబాబు 5 కాళూరి వెంకటనరసింగరావు 6 కొచ్చెర్లకోట వెంకటరామయ్య

# స్వర్గ దేవతలు

## కవితలు

శ్రీ శ్రీ స్వీయ వ్యాఖ్యలతో

## అనువాదాలు



తెన్నేటి వెంకటరామమూర్తి, వేదుల సత్య నారాయణశాస్త్రి, శ్రీ శ్రీ, రాజరత్నం



కొంపెల్ల జనార్దనరావ్

15-4-1906 * 23-7-1937

రెండు

# స్వర్గదేవతలు

(తదితర పద్యాలు)

# 1. కవితలు

## సమరాహ్వానము

ధైర్యము త్యజించి ఘోర యుద్ధంబునందు
ననుచిత పలాయన పథంబు ననుసరించి
ఓ సుయోధన! యెందేఁగియుంటి విపుడు?
రమ్ము, క్షత్రియోచిత సంగరం బొనర్ప

విసపుభోజన మొసఁగి చంపింపలేవు
వెస మహార్ణవమునఁ బారవేయలేవు
మించి లాక్షాగృహంబుఁ గాల్పించలేవు
ద్యూతమున గెల్చి మిగుల సంతోషమొంది
ద్రౌపదిని భంగపుచ్చంగఁ దలఁపలేవు
ఎట్టు లిక మమ్ము నిర్జింప నెంచినావు?
ఆజికంటెను వేఱుపాయంబు లేదు
కలదు త్రొక్కంగఁదగిన మార్గం బదొకటె
రమ్ము! క్షత్రియోచిత సంగరం బొనర్ప.

ద్వాదశాబ్దముల్ గహన నివాసమందుఁ
జెప్పఁగారాని సిలుగులఁ జెందినాము!
మాఱువేసంబుల విరాట మానవాధి
పతిపురంబున నజ్ఞావాసదీక్ష
జయపురస్సరముగఁ దీర్పఁ జాలినాము
చేయుమన్నట్టి పనులెల్లఁ జేసినాము!
తుదకుఁ బురపంచకముఁ గోర తుచ్ఛుఁడ వయి
కృష్ణసందేశము తిరస్కరించినావు
ఘోర సంగర మొనరింపఁ గోరినావు.
ధర్మమే జయ మను మాటఁ దలఁప వైతి!

కోరి కొఱవి చేకొని నెత్తి గోకికొంటి
బంధుమిత్రులు పరిజనుల్ భండనమున
తీవ్రయుద్ధంబు నొనరించి త్రెళ్ళినారు!
ఇప్పుడేమి యొనర్పఁగ నెంచినావు?
హస్తములు కాలిపోయిన నాకులేమి
చేయునో యింత యోచించి చెప్పుమయ్య!
ఇఁక విచారింప లాభమింతేని లేదు!

ఆజికంటెను వేఱు సాయంబులేదు!
కలదు త్రొక్కగ దాగిన మార్గం బదొకటె!
రమ్ము! క్షత్రియోచిత సంగరం బొనర్ప!

ఏవురము మే మనుచు మది నెంచవలదు
ఐదుగురిలోన నీకోరినట్టివాఁడె
ద్వంద్వయుద్ధంబు నొనరించవచ్చుఁ గాన
రమ్ము! క్షత్రియోచిత సంగరం బొనర్ప!
పాఱుఁ బోతువై దాగంగ వలదింక!!

ముద్రణ భారతి - నవంబరు 1926

## విజయవిహారము

**ఉత్తరుఁడు**

ఓ మహాత్మ! త్వదీయ మహోన్నత ప్ర
భావ మింతని పొగడ నెవ్వాని తరము!
అరి భయంకర గాండీవ జ్యానినాద
బధిరితాశాంత కుంభివి పార్థగనిను
నించుకయు మానసమున నూహింపలేక
అర్భకుడ నెన్నొ దుర్భాషలాడి నీదు
నవ్య నవనీత హృదయమ్ము నవయజేసి
నిరసన మొనర్చితి నటంచు నీవు క్రోధ
మూర్తివై నన్ను జిన్న చూపులనుగనక
ఎఱిఁగి చేసిన యపరాధ మిద్దికాని
కారణంబున దయజూచి కావుమయ్య?

కౌరవాన్వయ మెదురుగ గదిసినంత
డీకొనంగ దలంచి గాండీవధారి
వగుచు నెదుట ప్రత్యక్ష మైనప్పుడైన
హీనతమ భీరుగుణమెల్ల పోనడంచి
సారథిగనుండనో నీకు సంతసమున!

దిగ్దిగంతములందుఁ బ్రతి ధ్వనించు
ఘన ఘనా ఘనఘోష సంకాశమైన
శబ్ద మదికాదె శ్రోతల శ్రవణపుట వి
నిర్దళన శక్తివంతమై నెగడు దేవ
దత్తపూరణజనిత నాదంబు! వినిన
నెడద వడివడి దడదడ వడకదొడగు
నా భయంకర నినదంబు నాలకింప
గౌరవదళంబుల న్గలకలము పుట్టె!
యూధములు సిద్ధమగుచుండె యుద్ధమునకు
సైనికజనంబులదె మహోత్సాహశక్తి
గదనదుందుభుల్ మ్రోగింప గడగినారు!
పార్థ! నాకి సుమంతయు భయములేదు
తేరు నడపెద నీవన్న తీరుగాను!

భళిభళీ! ఏమి యీ బాహు పాటవంబు!
ఏమి యీతని సాయక వృష్టిధార!
ఔర! యీతని స్వేచ్ఛా విహారమరయ
భయమొకింతయు నుత్సాహభరముకొంత
వెఱపొకింతయు వివశతావిరతి కొంత
త్రాణలేమి యొకింత సంతసముకొంత
వివిధ భావము లిట్టు లావిర్భవించు!

ఉరుభయంకర శస్త్రాస్త్రయుతుడవగుచు
సురుచిరోదగ్రవదన తేజుండవగుచు
వర శిరో మండన కిరీట ధరుడవగుచు
హస్త యుగ్మంబుతో బాణహతుల వీర
వరనికాయము కలగుండు వడ నొనర్చి
పూర్ణమగు జయలక్ష్మినిఁ బొందుమయ్య!

అదె పలాయన మార్గంబు ననుసరించి
పారుచుండిరి కౌరవ వీరవరులుఁ
అదియె వారెల్ల సమ్మోహనాస్త్రబద్ధ
గాత్రులై కరచరణముల్గదప లేక
మూర్ఛఁగొని భూస్థలింబడి పోయినారు!
తడవొనర్పగనేల సత్వరితగతిని
సోదరి వాంఛితము దీర్పఁబోదుగాక!

*ముద్రణ ఆంధ్రభారతి (మాసపత్రిక) జూన్ 1928*

## అహర్ముఖము

అహర్ముఖాంచిత హర్ష వీచికల
జాండ భాండమున నిండినవి!
రహః ప్రశాంత దినోదయ వేళా
రాగ ఘోషములు మ్రోగినవి!

ఆ యుదయకాల రమ్య రహస్యగర్భ
సురభిళ లతాంతగుచ్ఛ మాధురులయందుఁ
దనువు పులకించు నూతనోత్సాహభరిత
మోదభరమున నా కనుల్ మూతవడియె!

అపుడు పొడమిన గాఢమాంద్యమున రేగి
కాలగర్భ విలీనాంధకారమందు
దరలిపోయితి భావసౌదామినీ ల
తాంచల సురక్షితస్థలి నధివసించి!

ఆ దినోదయ వేళా ప్రయాణ శుభ ము
హూర్తమున భావనా భావితోత్సవమున
నాకు గననయ్యె విస్మృతానేక చరిత
గత పురాతనసమయ భారత ధరిత్రి!

అప్పు డసదృశ శాంతి మహత్త్వగతుల
వెనుక దినముల బ్రజ్వలించిన చిరంత
నార్య వైభవవహ్ని సహస్రశిఖలు
కనులు పొడిచిన మెఱుపులై కానిపించె!

అవియె ఋష్యాశ్రమ మనోజ్ఞ దివిజ సదన
నిభ తలమ్ములు! వారె మౌనిప్రకాండు
లదియె ఘోషిలు దిక్కటాహములు నిండి
మారుమ్రోతల ఋగ్వేద మంజు రవళి!

ఆ సనాతనకాల ప్రభాసమేత
వేదభూసుర ఘోషా నవీన గతుల
బలుకు దెలియని తన్మయత్వమును గనిన
నా హృదంతరమునకు లీనత ఘటిల్లె!

ఐంద్ర హరిత్సము దంచిత దీధితు
లంధకారముల నడచినవి!
సాంద్ర వికాసస్ఫీత మద్హృదయ
సరసిజ దళములు విరిసినవి!

*రచన 1928 ఏప్రిల్ 10,*

*ముద్రణ భారతి - 1928 అక్టోబరు*

*I was gradually shaking off pompous phraseology*
*I think this poem clearly illustrates it*

## అంతఃస్సమాధి

"ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికర గుంఫిత కావ్య
స్మృతి రోమాంచ విశంకిత
చతురాంతః పుర వధూ ప్రసాదన రసికా"

అని పఠించితి 'పారిజాతాపహరణ'
సత్ప్రబంధమునందు --- ఆ క్షణమునందె
మనసునకు అవశత ఘటిల్లెను! గ్రహించ
రాని ఆవేగమున చేతిలోని పుస్త
కము ధరణిపైన పడియె! - అఖండ వివిధ
భావ భంగీ తరంగ సంపదలు పొదల
హృదయ మెగసెను పూర్వ విస్మృత నితాంత

దశ దిశాం
చామరమ్ము

దశ దిశాంత పరిశ్రాంత ధవళకీర్తి
చామరమ్ములతో సముజ్జ్వల విభా వి
రాజితమ్మగు శ్రీ కృష్ణరాయ భూప
మంటపమునకు –
– కవి శిఖామణు లనేకు
లదియె మధురాతి మధుర దివ్యప్రబంధ
కధన సుధల నఖండ సుఖప్రదముగ
చిలుకుచున్నారు! –
– కృష్ణరాయలు మహోజ్జ్వ
లాంగ దీధితు లెగసి స్వీయాక్షికోణ
నిర్గతాపాంగ రుచిసమున్మేషమునకు
వింత సొగసుల నెగడించు విధము చూప
అదిగొ ముదవమున పారవశ్యమ్ము చెంది
మెచ్చుచున్నాడు నయన నిమీలనమున,
క్రమదరహాసమున. శిరః కంపనమున!
మది కలంచిన శైశిరోన్మాదరేఖ
వదలినంతట నూత్న లావణ్యమునకు
సదమలానూన తేజః ప్రశస్తి నొసగు
శ్రీ గరిష్ఠ వసంత సమాగమమున
మెల్లగా వీచు పిల్లతెమ్మెరల కులికి
కులుకు మెలకువతో నవ కోరకములు
నూతన వయః పిపాసా పరీత హృదయ
సదన సంస్థిత గాఢ వాంఛలకు రేగి
తెరలు తెరలగు సిగ్గుదొంతరల పొరల
మనసు బిగువున నెగజిమ్మికొనుచు, ఘన వి
యోగ శాంతిని కలగాంచి ఒడలు నిలువు
పులకరిల్లిన హృదయ మాపుకొనలేక
వలపు దెసల పిసాళించు వలను తెలిపి
విరిసి వెలిగి విజృంభించు వేళలందు
ఏ మనోహర మంజులారామ భూమి
సౌరభానంత సౌందర్య సౌఖ్యగతుల
నందన వనోపమానంద బంధురంబొ
అదియె విలసిలు కృష్ణరాయల సభా ప్ర
భా శుభాకరతలము –

- ఆ వైభవమ్ము,
అప్పటి ధరారమణ గౌరవాతిశయము,
ఆ దినమ్ముల సౌఖ్యానుమోదరక్తి
నాటి సంపత్సమృద్ధి ఏనాటికైన
ఆంధ్ర నిర్భాగ్యధాత్రికి నలవడు నొకొ?

*రచన 1928 ఏప్రిల్ 27*

*ముద్రణ · భారతి - 1929 ఫిబ్రవరి.*

*A pose and a wailing For all its patriotism the theme with its treatment is ordinary*

## నా సొద - నా రొద

ఏకాకినైయున్న యీకాలమందు
నుదయించు నెన్నియో హృదయభేదకము
లగు నూహ లవియెల్ల నన్నివిధాల
బయలు చేసిన శాంతి ప్రాప్తించుననుచు
నాలోన నేనె పద్యాలను నుడివి,
'ఓ సముజ్వలరాగ భాసితానంద
రాజ్యాభిషిక్త మూర్ధన్యా! మదీయ
దైవతమా! జీవధనమా!' యటంచు
గొంతెత్తి నినుబిల్చుకొందు నొక్కపుడు!
పద్యాలచే శాంతి ప్రాపింపదేని
ప్రకృతి తీక్షణ ప్రభాపటల మధ్యమున
శారికా కీరికా నడమల కంఠ
ఘోషా నినాద సంతోషాప్తిఁ దేలి
యొక్కొక్కపరి నవ్వుచుందును నేనె!

అదియు శాంతికి దూరమగునట్లు దోఁప
నిదివఱకెవ్వాని కెఱుగంగరాని,
యెవ్వాఁడు చూడని, యెవ్వాఁడు చొరని
ప్రమదావన ప్రాంత రమణీయ దేశ
సమద వితర్ధికాస్థలిఁ జేరి యచట
గానమేళవిత ఘంటా నవ్యనాద
తాళ సంగతులతో దాండవించెదను,

అపుడు సైతము శాంతియలవడదేని,
గుండెరాతిగఁ జేసికొని భయంబెడలి
గాఢత మచ్చటా కలిత మర్ధాంత,
కాంతార వీథీ నిరంతర భయద
గిరి గహ్వరంబుల దరిసి యచ్చోట
గడలేని కన్నీటి కాల్వలఁబరపి
ఘూనభోంతరముల బొంగింపఁజేసి
దీనాతి దీన శోకానంతరవళి
నగముల మార్మోత లెగయంగజేయు,
శాంతి సామ్రాజ్య సంస్థాపనఁ గోరి
ఘోరున కెరలి వాపోయెద నేను

*ఆంధ్రభారతి, మాసపత్రిక మే. 1928*

## అగ్ని హోత్రము

సాంధ్య కాలారుణ గభస్తి సముదయమున
ప్రస్ఫురించెడు నిజవపుర్వైభవమ్ము
ఉదిత మానసికోత్సాహ ముజ్జ్వలింప
అమరు లనిమేష నయనులై అరయునపుడు
ఏ పరాత్పరమూర్తి సదా పవిత్ర
నాట్య లీలానుకూల విన్యాసములను
నెరపుచున్నాడొ ఆ హరు నిటలమందు
దాగి యడగిన అగ్నిహోత్రమును నేను

తత సనాతన భారత క్షితి తలమున
కతులితాలంక్రియామహోన్నతి వెలుంగు
అతి పవిత్రులు నాటి బ్రహ్మర్షివరులు
సతత మొనరించు క్రతు కార్యతతులయందు
వేదఘోషల మార్మోత పిక్కటిలగ
నను పొగడువేళ వారి ముందట నెసంగు
అమిత మోహన హోమకుండముల నడుమ
తాండవించిన అగ్నిహోత్రమును నేను!

జగతి పాపాంధకార విచ్ఛన్నమగుచు
పుణ్య మను మాట పూజ్యమై పోవునపుడు
దారుణ దురంత కలుష వర్తనముచేత
మానవ చరిత్రమున కష్టమయము కలుగ
ప్రళయభీకర పుష్కలావర్త మేఘ
ఘోషణ కఠోరతా ప్రసంకుల సమస్త
రోదసీగహ్వర ప్రతినాదములను
వినుట కొక ప్రాణియైనను కనగరాక
సృష్టినంతయు సప్తవార్నిధులు పొంగి
ముంచువేళల అందు నుద్భూతమైక
రాళ జిహ్వా సహస్ర దుర్దాంత రుచుల
ప్రజ్వరిల్లెడు బాడబ జ్వాల నేను!

రచన 1928 మే 25

*Not unsatisfactory poetry Yet the exultation in sound is manifest*

## కవితాశిల్పమునకు

అది మనోమోహనము! హృదయంగమమ్ము!
దాని సృష్టించు శిల్పి నిత్య ప్రపూజ్య
ఘనతర ప్రాభవయుతుండు! కవి యతండు!

భావనాతీత వివిధ ప్రపంచములను
భావనా మాత్రమున దాటి పోవువాడు,
సుఖ మహా దుఃఖ మిళిత నిష్ఠుర మనుష్య
జీవితమునకు వ్యాఖ్య రచించువాడు!

సుందరము తద్ఘటిత రసస్ఫూర్తి! మనుజ
హృదయములయందు విహరించి అది స్వకీయ
శాశ్వతానంద ముద్ర నచ్చట ఘటించు.

అది హృదయభూమి తాండవమాడునపుడు
శ్రవణమోహన గానవైభవము మ్రోయు!
ఆ సుధావాహినీ ప్రవాహమునయందు
క్రమ లాలిత్యమే నిరాఘాట మగును!
ప్రౌఢ శిల్పజగత్తున ప్రథమగణ్యు
డగును కవి - కవితాశిల్ప మతని దగుట!

రచన 1928 జూన్ 22

*Concealed moralising Good in a way Composed only for కవితా శిల్పము' in Samadarsini paper*

# సంధ్యాభావన

ఆ రమణీయ సంధ్యారాగ జలధిలో
తారా సహస్ర ముక్తామాలలు జనించె
ఆ సాంధ్యరాగ ప్రభా సౌకుమార్యమ్ము
లో సుధలు మాత్రమే భాసిల్లి పోయినవి.
ఆనంద భావవీచీ నినాదంబులో
కానంగరాక దుఃఖమ్ము శ్రుతి కల్పినది!
రోదోంతరాళ సంరూఢాంధకారాన
మాధుర్య మేది సంధ్యాదీప్తి నశియించె
అతి వికృత భయదాట్టహాస ధ్వనులతోడ
అంతటను దుఃఖమే ఆడిపాడగ దొడగె
ఆ యంధకార కుహరాంతరాళమునందు
ఏయే దురంతముల కెవడు సాక్ష్యము వచ్చు?
ఆ సాంధ్యరాగమే అనుకొనుడు జీవితము
భాసిల్లు తారకలె ప్రణయ సద్భావములు!
సాంధ్య రాగారామ జనిత ప్రసూనముల్
కంధ్యుదర లబ్ధ ముక్తా మాలికా తతులు!
ఆ మనస్య మహోజ్జ్వ లాగ్నికీలలయందు
ప్రేమైక దృక్కులే పీయూష శీతములు!
నశ్వరాంధ ధ్వాంత నమ్రజీవిత మెత్తి
శాశ్వతప్రేమ తేజంబె ఉన్నతి కూర్చు!

*రచన 1928 జూలై 12*

*ముద్రణ భారతి 1932 జనవరి*

*A poem that has undergone many changes which it does not require for all it is worth*

# విరహవంశి

ఈ నా వేణువు దీన గాన రస వా హిన్యంబువుల్ చేర్చి ఆ
హ్వానంబుల్ రచియించు వేళ కరుణాపాంగ ద్యుతుల్యాని ఓ
హో నాళీకిని! నన్ను జెందుటకు రాకున్నా విదేలా? విలా
సానందమ్మున ప్రేమరాజ్యముల చూరాడంగ నూహించుచున్.

ఈ సంక్షుబ్ధ మదీయ హృత్కుహర వహ్నిన్ చూపుచున్ ప్రేమ భి
క్షా సత్కారము కోరుచుంటిని సుధాగానమ్ములో గద్గదా
క్రోశమ్ముల్ నినదించు గీతికల నీకున్ కానుకల్ కూర్చి నీ
హాసజ్యోతుల కాసగొంటి నిక నా ఆరాట మూరార్చుమా!

అతి లావణ్యము జాలువార్చెడు మనోజ్ఞారామ భాగమ్ములం
దితరాలోచనలన్ త్యజించి రమణీ యేచ్ఛల్ ప్రపంచించు శా
శ్వత సత్ప్రేమరసైక భావనల సంభావింప సౌదామినీ
లతికాంగీ! కుతుకమ్ము కల్గునెడ వాల్లభ్యము చూపింపుమా!

*రచన 1928 జూలై 18*

*The worst I had written for a long time*

## ఆంధ్ర కవితా పితామహుడు

నీ యఖండ ప్రతిభ విరిసి య
నేక రుచుల తురంగలించెడు
మధువు లొలికిన మంజు కవితల
మనుచరిత్రమున..

ఆ దినమ్మున కృష్ణరాయ ధ
రాధిపుని పేరోలగమ్మున
త్వత్కవిత్వ రస స్రవంతిని
ధార కట్టినది.

మృదు మధుర గానధ్వనుల విని
కృష్ణ సర్పము లవశమొందిన
విధములవు డట నున్న పండిత
హృదయముల తోచె.

అపుడు మ్రోగెను నీదు పాదము
నందునుండి జనించి సభలో
గండపెండారపు సముజ్జ్వల
గాన గీతములు.

గౌరవము గని గరువముం గని
పారవశ్యము చెంది ఆశీ
ర్వ్వనులతో శ్రీకృష్ణరాయని
ధన్యు చేసితివి.

ఏండ్లు పూండ్లును నాడు మొదలు గ
తించె కాని భవద్యశస్సులు
నేటివరకు శరత్సుధాకర
నిర్మలత తాల్చు

నీవు నాటిన తోటలోపల
చేవ తరుగని పూవుగుత్తులు
నేటివరకును తేటవలపులు
నింపెడిని దెసల

జీవచిత్ర కళారహస్యము
చిందువార్చిన నీకవిత్వము
చిత్రకారుల చేతగల కుం
చియల విచ్చినది

తెలుగు కవనపు తీరు తీయము
నిలిచి వెలుగుట కొక మెరుంగును
చిలికి చుక్కలనడుమ మింటను
కులుకుచున్నావు.

*రచన 1928 జులై 22*

*ముద్రణ కవితాసమితి తొలివార్షిక సంచిక 1929*

*An attempt at a new metre Technique is tolerably well observed There is narration and poetisation, but not much force and gusto*

"నీవు నాటిన తోట లోపల" చరణానికి ఎదురుగా రాసిన వ్యాఖ్య ·

by attempting this metre I have learned to tone down my Sanscritic diction

# అంధకారము

*సాయంసంధ్య -*

దివసమ్మునకు వయోధికత ప్రాప్తించినది
తీక్ష దీప్తు లడంగి దినరాజు కృశియించె!
వృద్ధాప్త మిడిన దీవెనచేత జనియించి
ఔద్ధత్యమునచే అహర్పతిన్ మ్రింగితిని!
ఈ నా భవమ్ము లోకానంద మొసగునా?
ఏ నెప్పటికి కూడ ఇటు వికాసింతునా?
నా కెన్నటికినైన లేకుండునా మృతి?
ఈ కాంతి నశియించి చీకటులు క్రమ్మవా?

*అంధకారము -*

ఈ దివారోచిస్సుధాధామముం గూల్చి
ప్రాదుర్భవించి నే బయలుదేరిన యంత
జగతి యేమోగాని
నగవే మరచిపోయి
వగపుచే నిట్టూర్చి
వనటచే చలియించు!
నా మేలిముసుగులో నలుపు లూరెడు నంట!
నామీద జగతి కింతయు ప్రేమ లేదంట!

*నక్షత్రము -*

ఈ గభీర నిశీథినీ గర్భకుహరాన
ఎలుగెత్తి ఏడ్తు వెందుల కంధకారమా!
వాగులై నా ప్రేమ వరియించునే నిన్ను
స్వాగత మ్మొసగు నాశాగంధ వాయువుల్!
నిలువలేనే నీవు
నిలిచియుండని వేళ
వెలుగలేనే నీవు
విస్తరించని వేళ
నీ కాటుకల చేత నా కనుల్వికసించు
నీకు నేనే నాకు నీవె ఈ లోకాన!

*రచన . 1928 అక్టోబరు 14  ముద్రణ  భారతి - 1928 డిసెంబరు*

*A fine specimen of lyric poetry The retention of the first stanza is harmless The metre is quite well handled. I would have written much more on this, had I not been its author*

# సముద్రపుటొడ్డున

ఎంత ప్రేమించుకొందు నే నీ సుసాంధ్య
సమయ గంభీర భావ విస్మయమునందు
నన్ను తేల్చిన మధురక్షణాల సుఖము
ఇవి గభీరోదకములు నా ఎదుట భీష
ణార్భటులతోడ నుప్పొంగు నవసరమున
నా మనస్సునగల భావనా సహస్ర
సంహతులలోన సృష్టి అస్పష్ట మయ్యె!
ఆ మహాదూరమున పశ్చిమాశ కూడ
బెట్టుకున్న కుంకుమ చూచినట్టు కూడ
జ్ఞాపకము లేదు - నా మనశ్చంచలత న
శించ, క్రొంగ్రొత్త భావాలు చివురులెత్త!

సాంధ్య వాతూల వీచీ ప్రసార ముగ్ధ
మీ సమస్త ప్రకృతి కాని ఏమొ నాకు
నా మధుర భావనలలోననే మనస్సు
బద్ధమై ముగ్ధమై మహాభాగ్యమిచ్చె!

అరచుకొనుచున్న ఈ సమస్తావకాశ
నిబిడఘోషకు బధిరతా నియతిచెంది
శాంత భావాలె లోన త్రుళ్ళింతలాడు!
కలుష కర్దమ మధిక వక్రమ్ము ఈ ని
తాంత వాతావరణ మింత దాటనేర్చి
ఈ పవిత్ర భావమ్ముల కెడ మొసంగె
ఎంత ప్రేమించుకొందు నే నీ క్షణాల!

*రచన . 1928 నవంబర్ 16*

*Keats inspired this But no traces are visible in the poem itself With nothing as subject matter, some substantial things have been arrived at*

# నిశీథ సాంత్వనము

ఈ నడిరేయి నా హృదయ
మీ విధిగా మధుధారయై వృథా
యైన శశాంకకౌముదుల
యందు ద్రవించె - నిశీథ నిర్మల
ప్రాణము మాటిమాటికి భ
యమ్మున నా గళ మింక మ్రోయగా
మానునొకో అటన్న అను
మానముతో కడు సంచలించగన్.

శాంత విభావరీ హృదయ
సాధ్వసమున్ గ్రహియించి వింతలో
ఎంతయు తెల్లబోయినటు
లే ఒక లే తెలిమబ్బు నింగిపై
అంతయు క్రమ్మికొన్న ధవ
ళాంశు మరీచులలో మునింగి తా
నంతట మాయమై చనియె
ఆవిరి యట్లుగ చూచునంతలో.

ఏ గతి పాడకుందును జ
నించిన ఊహల నెల్ల నా మన
స్సాగర మంతకంతకు ని
సర్గ పిపాసల పొంగి నింగిపై
ఊగగ నేగు నంతట, న
వోజ్జ్వల మోహన కావ్యగీతికా
వాగమృతమ్ము లాగక ప్ర
వంతికలై ప్రవహించు నంతటన్.

మామక వాణి ఈ నిఖిల
మంగళలోక దరస్మితమ్ములో.
ఈ మృదు చంద్రికా పులకి
తేందు శిలాజల ధారలో, దిశా
స్తోమ సుధాకపోల పరి

చుంబన తత్పర మాతరిశ్వ హృ
త్ప్రేమ సుఖమ్ములో, కని న
దించు నుదంచిత భావరాగముల్

నా లలిత ధ్వనుల్ విని మ
నస్సు వినిర్మలతా పరీతమై
చాల సుఖప్రభూతి కన
శర్వరి నా నవ వృత్తగాన ప
క్షాల సుషుప్తి తేలెడిని
శాంతిగ నుత్పల కోరకావళీ
మాలికలే మనోహర స
మంచిత శయ్యగ హాయిహాయిగాన్

రచన 1929 ఫిబ్రవరి 9
ముద్రణ భారతి - 1929 మార్చి

*This forms a subject matter for the discussion of the element of sinerity in lyric poetry The setting is conceived in imagination but the mood is quite sincere Mind is given a slight preference over heart (because of the intellectuality of imagination) but the latter is not overlooked or the poem would never have been sung*

## తమస్విని

వినదించునా వినూతన చకోరక గీతి
కనిపించునా సుధాకర బంధుర జ్యోతి
నా యమావాస్యా విహాయసమ్మున నేడు?

ఒక ఎరుంగని వేదనోద్వేలత వహించి
వికసించి ముకుళించి బెగడు నక్షత్రాలు
ఎదొ హృదంతర బాధ పడలేక విడిపోయి
కదలాడు తెరువింత కనరాక జలదాలు
ఏ చెట్టు మసకలందో చరించి సమీర
వీచికలు బ్రదుకు నాతో చెప్పుకొని ఏడ్చు
నా గర్భమున రోదన ధ్వానములె మ్రోగు!

ఏ నెరుంగుదు ప్రేయసీ నూత్న యౌవనా
ధీనుడై ప్రియుడు వర్తిలిన వెన్నెలవేళ
తీయనై నాటి సందీప్తి తోచెను కాని
ఈ యమావాస్యనే హెచ్చు నే వరియింతు!
నేను దట్టపు మంచు సోనలే కురియింతు!

*రచన 1929 ఏప్రిల్ 3*

*ముద్రణ భారతి - 1929 మే*

*Not a Krishnasastrian exultation in things that are gloomy, though technique recalls some of his lyrics The poet's penetration into the heart of Night results in the presentation of the feelings of Night But the poet is not detached from the poem which gives it the necessary quality of lyricism*

## మధుమూర్తి!

నీ నాట్యమ్ములు నా మనస్థ్సలినె కా
నిమ్మోయి! నీ గాన లీ
లా నైర్మల్య నవోజ్జ్వలశ్రుతులు కా
ల్వ ల్గట్టి నా కంఠమం
దే నిండంగ నదించుమోయి! మధుమూ
ర్తీ! నీ కటాక్ష ద్యుతుల్
రానిమ్మోయి మదీయ జీవిత తమి
స్ర ద్వారమున్ చీల్చుచున్!

ఈ గళమాంద్య మింత నశి
యించును నీ మృదు గానరావముల్
మ్రోగినచో, ధ్వనింతును స
ముజ్జ్వల గీతులు నేను కూడ నీ
లాగునె! త్వద్వినర్తన క
ళా పరిపూర్ణమెయైన నా మన
స్సాగర మంత తాండవ వి
శారదతన్ వహియించు నీ వలెన్

అంత సుఖమ్ము నా కధిక
మై మరపించును మేను - నీ ఘృణా
నంత కటాక్ష మాలికల
యం దతి తన్మయతన్ వహింతు - నా
స్వాంతము సౌఖ్యవేదన నె
సంగు - భరించగచాల కంత ప్రా
ర్థింతు సుఖము తీసికొని
దీనతనే కరుణించగా ప్రభూ!
నీవు హసింతు వంతట వి
నిర్మల సాంద్ర సుధామృదూర్మికల్
ప్లావితమై తదీయ తర
ళ ద్యుతులందు జగమ్ము ముగ్ధమై
పోవును - నే ద్రవింతు రస
పుంజముగా, మిహికా స్రవంతిగా
నీ వరహాస కౌముదుల
నిస్తుల మాధురిలో విలీనమై!

*రచన 1929 ఏప్రిల్ 6*

*ముద్రణ : భారతి - 1929 జూన్*

*Excellent handling of the metre This art form is familiarised in the subsequent lyrics tha deal with Divine Love but the fervour and felicity of these verses is not reflected in them. మూగతలపులు follow other lines of thought but are conducted on similar felicitous technique*

## సుప్తాస్థికలు

అవి ధరాగర్భమున మానవాస్థికా ప
రంపరలు - సుప్త నిశ్శబ్ద సంపుటములు!
అట నొకే దీర్ఘ యామిని! ఆ నిశా శ్మ
శాన శయ్యకు ప్రాతః ప్రసక్తి లేదు!

ఆ యగమ్య తమో రహస్యాంగణాన
తాండవించును మృత్యుశైతల్య మొకటె -
అది నితాంత హేమంత హృదంత రంత
రనుభవాళి ఘనీభవించిన సమాధి.

ఆ మనుష్యాస్థికలు నిద్రలో మునింగి
సంచరించును భైరవ స్వప్నవీథి!
అవి చలించును తమ చర్మకవచ మెపుడొ
బ్రదికిన దినాల తలపోత బరువుచేత!

నా కనుంగవ కన్నీళులై కరంగు
నవి యొనర్చెడు నీరవాహ్వాన మెరిగి -
ఇంత శోషిల్లు నేలొ నా హృదయపుటము -
వణకు నేటికొ నా అస్థిపంజరమ్ము!

*రచన 1929 ఏప్రిల్ 16*

*ముద్రణ సమదర్శిని మాసపత్రిక 1930, 1931 సంవత్సరాది సంచిక*

Returned with thanks by the BHARATHI One of my best poems in my and many an other's opinion

## సుమార్చన

నేజరియింతు నుజ్జ్వల వ
నీ రమణీయ వసంత వీథులన్
పూజకు కోర్కి నా యెద ర
వుల్కొను నింతట; అంతలో ప్రభా
భాజనమైన నా పసిడి
పళ్ళెము తాలిచి వృక్షవాటికా
రాజిత మార్గగామి నయి
రా, కనుపట్టు లతాంత సంతతుల్.
మౌన మనోహరమ్ముగ సు
మ ప్రతతుల్ నను పల్కరించి పూ
జా నవభాగ్య వాంఛనలు
జాలుకొనన్ కను లింత విచ్చి ఆ
హ్వానములన్ రచించెడు, మ
దంగుళు లించుక సంచలించగా
వానిని కోసి, పోసికొని
పళ్ళెమునన్, పయనింతు మెల్లనన్.

ఈ విరిదోట దాటుచు బ
    హిః పథమందున కాలువెట్టగా
బోవు ముహూర్తవేళ తల
    పోయగ బోని మహోత్సవమ్ముగా
నీ వొక రమ్యమూర్తి వయి
    నిల్తువు ముంగిట, నీ పదద్వయిన్
పూవుల పళ్ళెరమ్ము దిగ
    బోసి తలంకుదు నేను లజ్జచేన్

చాల చలించు చూడ్కు లల
    సమ్ముగ తావక దివ్యమూర్తి నే
వీలుననో కనుంగొని ఆ
    వేద్య మనోజ్ఞ సుఖానుభూతులన్
తేలగ, నా ఎడంద భవ
    దీయ పదానత భాగ్యరేఖలన్
వ్రాలు నవప్రపుల్ల సుమ
    న స్సుషమాకృతి నర్చనారతిన్.

*రచన 1929 సెప్టెంబరు 12*

*ముద్రణ భారతి - 1929 అక్టోబరు*

*Second of its series The four-verse art-form with the final surprise The verses have a stability built up by extreme but concealed effort The final surprise is well worked up*

## భావిదృష్టి

అట కవితా ప్రపంచము ల
    హర్నిశమున్ రసవన్నవీన వి
స్ఫుట నటనాప్రసక్తి మెయి
    సోలును, తేలు ననంత హర్షపున్
ఘటికలలో సహస్ర రవి
    కాంతులు మేదుర రమ్య వర్ణ సం
ఘటనము కూర్చి, నా కదియె
    కామ్యపథమ్ము భవిష్యదాశలన్.

నా తలపోత లీక్షణము
        నన్ పరువెత్తు నదృశ్య పక్ష సం
పాతముతో, రయోద్ధత సు
        పర్వ విమాన పలాయన క్రియా
తీతములై - సుధామధుర
        దివ్యపథాలకు, భావికాల వి
ద్యోతిత నాట్యశాలలకు,
        జ్యోతి రఖండ యశోంగణాలకున్

భావి వికాస వాటికల
        బాటలలో చను నాకు నా కవి
త్వావృత గీతులే వినగ
        నౌను చలద్గరుదంచలమ్ములై!
దైవధునీ ప్రసన్న సిక
        తాస్థలులన్ విహరించు నాకు నా
పూవుల పాటలే వరద
        పోవును తేనియ తేట యూటలన్.

నే నిపుడే వదించిన అ
        నేక రహశ్శృతు లాలకించగా
లేని జగత్తులో ప్రతిఫ
        లించదు నా హృదయమ్ము నేడు సం
ధ్యా నిశితారుణ ప్రభలు
        దాచిన యామినిలో చరించు నా
మానస మింక భావి సుష
        మా వికసద్రుచు లాస్వదించెడున్.

రచన 1929 సెప్టెంబరు 16
ముద్రణ · భారతి - నవంబరు 1929

*A Vision not bad, and a Presentation not crude*
*The thoughts have raucous sound or else the poetry is fine.*

## గీతి

మొయిలు కదుపుల నును మేలిముసుగు వెడలి
గగన సీమంతినీ కటాక్షములు మెరసె
నెమలిపురి నీలి మేలి వన్నెల వికాస
ముల వలె వెలింగి నా భావములు నటించె!

*రచన 1929 నవంబరు 18*

*ముద్రణ భారతి - డిసెంబరు 1929*

*An unexpected coincidence with one of Tagore's lyrics This is inspired by a phrase in Mr Viswam's poem and not by the lyric in the Modern Review, though I read it before I had written this*

## స్వేచ్ఛా విహంగము

నీవు నభో విటంకమున
నిర్మల పాండు పయోద మాలికల్
త్రోవ యొసంగ పక్షముల
దూయుచు హాయిగ సంచరించు స్వే
చ్ఛావిలసద్విహంగమవు
స్వామి! క్షుధావిలమైన చూడ్కులన్
నీ విహరించు మార్గమున
నిల్చి కనుంగొనుచుందు నే నిటన్

ఏ రుచిరానురాగముల
నీనెడు దూర దిశా నిశాంతమున్
చేరెదవో నినున్ కనక
నే నిట గాసిల, ఏ ప్రఫుల్ల క
ల్హార సుమావళీ పరిమ
ళమ్ములు మూగు సురాపగా సుధా
తీరములో చరించెదవొ
దీనత నాకిట సంఘటించగన్

నూతన పారిజాత సుమ
నో రమణీయములైన భావముల్
పూతలు పూచు నా యెద, వి
ముక్త మహాశుగ మట్లు దాటుచున్

ద్యోతలమున్ విహార పరి
ధూత గరున్నృదుకాంతివాహినీ
స్నాత మనోహరమ్ముగ నొ
నర్చు నినున్ కనునంత వింతగన్.

కోమల పల్లవమ్ము లయి
కోర్కులు క్రొందనమున్ వహించగా
నా మదియే ప్రసూన నవ
నందనమై వికసించు, అంత నో
స్వామి! వియత్పథాల దిగి
వచ్చెద వీవు నిగూఢ వీథికా
ధామములన్ త్యజించుచు ని
తాంతము నిందె నివాసమొందగన్.

*రచన . 1930 జనవరి 17*

*ముద్రణ ఆంధ్రపత్రిక ప్రమోదూత సంవత్సరాది సంచిక 1930-31*

*There is tangible emotion but it is not well sustained The metrical technique is only observed, as it is not in my way to spoil it*

## హారతి

ఈ తామసీ నిశ్శబ్దహృది మన
కిర్త్వరకు స్వాగతముగా
శ్వేత స్మితామృత శిశిర వీచీ
శీకరము లాలయించగా

చేతస్సముద్ర తరంగ నాట్యము
లై తలంపులు తరలగా
ఆతంకమింతయు లేక నీ కొర
కాలపించెద గీతముల్

నాతో విశాల విహాయసాల వి
నూతనాధ్వములకు నినున్
శీతాంశు శీతల కిరణ తంతుల
నూతగొని కొని పోవుదున్!

ఏతెంచుచున్నవి కౌముదీ రమ
ణీయ వీణాగానపున్
స్రోతస్సులన్ ద్రవియించు కైరవ
సూనముల నవగంధముల్.

జ్యోతిర్మనోజ్ఞము లీ పవిత్రము
హూర్తముల్ మన భాగ్యముల్
వీత ప్రపంచ వ్యథాత్ములమై
వెల్గిపోదము వెన్నెలన్

*రచన 1930 ఫిబ్రవరి 19*

*ముద్రణ శృంగార కంఠాభరణము 24-10-1930*

*శృంగారగ్రంధమాల - శృంగారసంచిక*

*Composed for a magazine and yet it has good things in it There is cadence in the meter, which is well maintained in handling The sentimentality will be pardoned for its poetic conception*

*సంపాదకుడు గంటిసూర్యనారాయణశాస్త్రి*

*ప్రకాశకులు జి యన్ శాస్త్రి మద్రాసు*

## వేణుగానము

అంధకారము దిక్కుల నంతరించె
మెల్లమెల్లన తెల్లన వెల్లువయ్యె,
అంతలోపల జగమంత హ్లాదపరత
నలరఁ బ్రకృతి సితస్మేర లలితమయ్యె

గూడులన్ వీడి తమ వారితోడఁ గూడి
చివురుఁ గొమ్మలపై మహోత్సవము గాగ,
వీనులకు విందు గాఁగ సుధానవమగు
గానవర్షము నీడజ గణము గురిసె.

అంతవర కచేతనముగ నణఁగి యున్న
విశ్వమందుఁ జైతన్యమ్ము వెల్లి విరిసె;
చేతన పదార్థములు కాంతిచే వెలింగె;
కాంతికల్లోలినులు ధాత్రిఁ గడలుకొనియె.

పాలకై విడి, లేఁగలు పరువులెత్తి
తల్లిపొదుగులఁ బొడుచుచు ద్రావెఁ బాలు
చలిదిబువ్వలు భుజియించి సంగడీంద్రఁ
బిలువసాగిరి గొల్లలపిల్ల లపుడు.

బాలపవనుండు ముందుగాఁ బరువులెత్తఁ
బట్టగాఁ బోవగావలెఁ బల్లటీల
గొట్టుచున్ బోవఁగా సాగెఁ గోమలంపుఁ
జిన్ని కెరటాలు యమునలోఁ జెన్ను మిగిలి

యమునయొడ్డున దూరాన నచ్చ టచటఁ
బచ్చికలు నిండిపోయిన బయళులందు
గోవులను, లేగదూడలఁ గొనుచు వెంట
గోపబాలు రెందఱొ మేపుకోఁ దిరిగిరి

వారిలో నొక బాలుఁడు వన్నెకాఁడు
నీల నీరదసంకాశ నిస్తులాంగుఁ
డమల శుభలక్షణాన్వితుఁ డమృతమధుర
మందహాసాననుఁడు, కాంతిమహితమూర్తి

ఒక మనోహర వేణువు నూఁదె నతఁడు
చేతనాచేతన సమగ్ర సృష్టి యులికి
మారుమ్రోఁత లొనర్చుచు మరల మరల
మధుర మధుర గీతానందమయముగాఁగ

ఆ మసృణగానమాధుర్య మమర గీతి
కా కళామధుమతుల నిరాకరించు
పొరలు నచటి గానస్వాదుఝురము నందు
భువనములు లవమ్ములుగనై పొరలిపోవు.

కానన విహంగమా! నీదు గానరవళి
మాని, దట్టంపు టాకులమ్రానిచివురు
లాని, మౌగ్ధ్యమ్ముపూని యే మూలకింతు
వేమి యానంద మెంత వహించినావు?

ఓ తమాలశాఖిక! యమునాతరంగ
నాట్యమూర్తి! మీ కెంత యానంద మిపుడు!
లేఁగ లావులు, గోపకు లీ గభీర
గానమున మానసిక మూర్ఛ గనిరొ యేమొ?

వేణుగళ నిర్గళన్మృదుగాన రవళి
నమరు లాలకించిరి గగనాంగణాన,
ప్రకృతి ప్రతిమగనై వినెఁ బరవశాన
భువనములు మారె నందనమ్ములుగ నపుడు

ముద్రణ భారతి 1930 సెప్టెంబరు

## లాస్యతృష్ణ

కడలి కెరటాల శృతిలోన కలసి మెలసి
గగన గంధర్వగాన రాగములు మ్రోయ
తూర్పుదిక్కున పూర్ణిమా తుహినకరుడు
తరళ ధవళ విలాస నర్తనము తెరచె

ఈ విశాల సమగ్ర వాతావరణము
కాంతితంత్రీ సుధామృదుగాన గీతు
లెగయు జగదీశ్వరాంఘ్రి మంజీర నటన
మటులనంత లీలానాట్య మభినయించె.

తారకలు లేని స్వచ్ఛ సౌందర్య బంధు
రాంబరాంగణ మొక ధవళాంబరిపలె,
అమృత వారాశివలెనె చరాచరముల
కిడెను తన దివ్య లాస్య సాహిత్య రుచులు.

ఇది జలధినాథు నెదలోన నిముడలేని
ఎదురులేని మహాసౌఖ్యమేమొ - శీత
వీచికా మేదుర తుషార సేచనమున
ఆకసము నంటుకో సోలియాడు నితడు.

ఉరలునా నా ఎడంద ఈ దొరలు తరగ
లం దొక సుధాంశుకిరణమై హర్షగాన
కలకల శ్రావ్య నినదము లొలయుచున్, న
వీన ఫేన ద్యుతులలోన లీన మగుచు.

రచన 1931 జనవరి 6

*ముద్రణ భారతి - ఏప్రిల్ 1931*

*For a discourse on the merits of lyricism I choose this as a useful example This lyric is both descriptive and emotional, the one arising out of the other The expression is felicitous The "central theme necessary for a lyric" pervades the whole poem Its appeal is more emotional than intellectual in spite of the similes contained Either of these is permissible but the portraiture of emotion is most necessary to a lyric poet*

## బౌద్ధ తేజస్సు

ప్రాతరాకాశమున పరంజ్యోతి యొకటి
వేనవేలు దీధితు లీని వెల్గిపోయె
అర్చరాని ఆ తేజోదవానలమ్ము
కౌముదీశీతలము, దెసల్ కారుకొనియె

అది మహాంభో నిధానమైనది! తరంగ
నాట్యములలో ప్రశాంతి విన్నాణ మొలికె
దాన సంభూతమైన రత్న త్రయమ్ము
నేరుకొన్నారు ముగ్ధ మహీజనాలు.

ఒక్క కరుణార్ద్రనయన కవోష్ణధార
గగననది కెరటా లుడుకన్ దహించు
ఒక్క యెద ప్రేమచే మ్రోయునో చరాచ
రాత్మకము విశ్వహృదియె విహ్వలత కాంచు.

ఆ హృదంతిక మా నయనాశ్రువృష్టి
సృష్టి నుండి ప్రతిధ్వనుల్ చేదికొనియె
ప్రాణులు విముక్తి కాంచు నిర్వాణ పదవి
జగ మెరింగెను 'బౌద్ధతేజస్సు' వలన!

*రచన 1931 ఏప్రిల్ 7, ముద్రణ భారతి - ఆగస్టు 1931*

*Appetite whets the spirit This and the subsequent 2 lyrics are done in remarkably short space of time Abstract expression preferred to the concrete, compression and concentration to the elaborate and dilute*

## భావనాపథి

నేనిపు డీ విధాన పయ
నించెడు నంతట ధారుణీమనో
మౌన రహోవకుంఠనము
మాటికి మాటి కెడల్చుచున్ ప్రశాం
తానిలముల్ మహోజ్జ్వలయి.
స్వాగత గీతికలై, ప్రబోధ వి
జ్ఞాన గళాంక విస్ఫురిత
శంఖ వినాదములై ధ్వనించెడున్.

మంజుల మీ నిశీథ సుకు
మార విలాసము! చంద్రికా రజః
పుంజమునం దడంగిన త
మో నివహమ్ములు, షట్పదీ ధను
శ్శింజితముల్ చెవిన్ చొర కృ
శించెడు శైశిర కాందిశీకు రే
ఖం జనియెన్ తమాలములు
క్రమ్మిన చాటుల దాగి పోవగన్

నేనే ఈ నిశనై, మదీయ రసనా
నిష్పన్నముల్ గాన వీ
ణా నాట్యమ్ములు గాగ ఈ మృదుల చం
ద్రజ్యోత్స్నలై, మామక
ప్రాణాధారము లాశయద్యుతులె తా
రా కోరకాలైనవే
లానంతాంబుధులందు చేయనొ ప్రవా
ళ ద్వీప నిర్మాణముల్

ఇది కవితా సతీ వికసి
తేచ్ఛ పరీమళ మొల్కువేళ, శా
రద నవ కౌముదీ తరుణ
రాస కళావలనమ్ములాడు న

భ్యుదయ పదమ్ము, విశ్వవిభు
డూయెల నూగగ రేగు నీ పువుల్ -
హృదయము కల్గినా పలుక
రింపుడు పాటలుపాడు రాతిరిన్.

రచన 1931 ఏప్రిల్ 12
ముద్రణ గృహలక్ష్మి - జూలై 1931

## మూగ తలపులు

రేగెడు గాలిలో కలవ
రించెడు జీర్ణ తృణాల జీవితా
శాగతి వేణుగానముగ
జల్లన నూదుదునా? ప్రవాహినీ
వేగములో చలించి మొర
వెట్టు మహీరుహమందు నార్తిపో
గా గిలిగింత కొల్పి తమ
కమ్మున నొడ్డున చేరవైతునా?

ఆ కెరటాలు ఫేన దర
హాస మొనర్చుచు కైరవాప్త రే
ఖా కిలికించితాల తెలి
కౌగిళులన్ శయనించు హాయిగా
ఏ కల లెంత తీయదన
మీనెడినో, మృదు పుష్పశయ్యలన్
లోకము సైతమున్ నిదుర
లో కదలించును నేత్ర పక్ష్మముల్

ముసరు నిశాంధకారముల
మ్రోతలలో నొక మూల తారకా
రసిక విలాస వీణ కొస
రన్ తలపోసెడు మూగపాటకే
దెసలు చెవుల్ నిగుడ్చి పర
తేరని రాగము లాసచేయు, ని

శ్వసనము లాగుచున్, హృదయ
వాద్యరుతుల్ బిగియించి వేగుచున్.

ఏ స్మిత భిక్షకోసమొ వ
హించిన జీవితపాత్ర నిండ బా
ధా స్మృతులే స్రవించి ఎడ
దన్ కలగించ, నిగూఢ కందరా
వేశ్మమునందు చేరిన వి
విక్త నిశీథిని కోరినాడ నా
కస్మిక చంచలాచ్ఛ లత
కా నటనన్, తిమిరాలె సోలెడిన్.

*రచన 1931 ఏప్రిల్ 13*

*ముద్రణ వైశాఖి (కవితా సమితి) ద్వితీయ వార్షిక సంచిక - 1932*

*Practice of the poetry of suggestion Imaginative power becomes felt but other things rather intangible Novel variation of the usual lyric They are expressive of fleeting moods caught in a finely woven net Take them for what they are worth*

## వన దృశ్యము

కానన శోభ లీ యెడ వి
కాసిల లే సెలయేటి యొడ్డునన్
నే నొక వాయువీచి కర
ణిన్ తిరుగాడుదు, లోలభావనా
మౌనపథాలలో మలయ
మారుతసేవ ఘటిల్లగా, తరం
గానత గద్గద స్వన ర
హః కథికా మధువారు లానుచున్

గగన విటంక మందుకొన
గా పరువెత్తు నగాంచలమ్ములన్
సొగసుల ప్రోవులట్లెగురు
చున్, వలయావళులన్ రచించుచున్
దగకొని యున్న నా శ్రవణ

తత్పరతాపరితృప్తికిన్ సుఖ
మ్మగ నెలుగెత్తి పాడుకొను
పుల్గులె నా ఎద మెచ్చు నెచ్చెలుల్

ఈ యెడ విస్తరిల్లు ప్రతి
హృద్య లతాంత పరీమళాల నా
లో యువకానుభోగ సర
ళుల్ పులకించు, రస ప్రమోదపున్
తీయదనాలు నించుకొను
తీర నదద్రుతి క్రమవాయువుల్
నా యెద భావతంత్రుల ని
నాదిలచేయు నెవో కవిత్వముల్.

ఈ వనదృశ్యమే కుముది
నీశ్వర భాస్వర హాసమై కళా
ప్రావరణమ్ములన్ తొణకు
లాడు, పురాస్మృత సౌహృదమ్ములే
క్రోవలు తేరు నిచ్చట ని
గూఢ మనశ్శుభ తోరణమ్ములై
దైవకృపా స్ఫుటిద్యుతి ని
ధానములే వికసించు పూవులై!

*రచన 1931 అక్టోబరు 1*
*ముద్రణ భారతి - నవంబరు 1931*

*In this and the next poem there is a certain heaviness in movement which eclipses the trend of thought demanding as it does undue attention. Considerable alteration is necessary for this apparently settled style.*

# స్వర్గ దేవతలు

ఆకసమందు మోహనము
　　లైన పయోదము లచ్చటచ్చటన్
ప్రాకుచు తేలియాడి చెద
　　రన్, వెలిగించితి రెవ్వరో తరం
గాకుల దీనగాన చలి
　　తాబ్ధికి నాట్యము నేర్పు చంద్రమ
శ్శ్రీ కమనీయ దీపశిఖ!
　　చెప్పుడు వెన్నెల లిట్లె నిల్చునా?

మీ తెలి స్వప్న మేమొ కుసు
　　మీకృత నాక హృదంతరాళ ని
ర్యాత పరీమళమ్మయిన
　　రమ్య శశాంక మరీచి మాలికా
శీతలశోభ నేటి దిది?
　　చిందెదరా చిర గాఢ సుప్తి ము
ద్రా తిమిరావృతావధులు
　　దారి కనుంగొను పూర్వ సంస్కృతుల్

ఆ పరిశుభ్ర నిశ్చల వి
　　హాయస వేదిక మీద మీ పద
వ్యాపృతి మల్లికా సుమ ద
　　ళాచ్ఛ కళాద్భుతిగా వెలుంగ, నే
లా పరికించు నా కనుల
　　కై సుకుమార చకోర పూజగా
రేపుదు రీ పరీమళ వ
　　రిష్ఠ తుషార వృషత్పరంపరల్?

మీ రెవరో క్షణక్షణ ని
　　మీలన మోహననేత్రులై తమో
భార సుషుప్తిలో తొణకు
　　స్వప్న గరుత్తుల చంచలానిలాం

కూరములన్ దిశావధుల
  కున్ వెలిపూతల సోయగమ్ము క
ర్పూర సువాసనా మిళిత
  భోగముగా నిడు స్వర్గదేవతల్
కారు గదా !

. మనోహరముగా నిశి పాడెడు నిట్టి వేళలన్
నాకధునీ సుధాపులిన
  నాట్య విశారదులై త్రివిష్టపా
నోకహ మంద మారుత మ
  నోజ్జత చందనచర్చ పోలికన్
సోకగ నప్సరోహసన శోభల తానములాడు! మీర లే
లా కకుబంతవీధికల లాస్య మొనర్తురు సోలి పోవుచున్.

దయ గనినారొసుప్తి నల
  తన్ నశియించిన నాపయిన్? జలా
శయ రసవత్సమీరముల
  చాడ్పున కారుబెడారి దారిలో -
పయిపయి సోకగా భవ ద
  పార మనోహర గానగీతికల్
పయన మొనర్తునా ఇక గ
  వాక్ష గళస్ఫుదు కౌముదీపథిన్

ఈ యొక రాత్రి నాకనుల
  కిచ్చితి రద్భుత దివ్యదర్శన
చ్ఛాయ నొకింత, తావక వి
  శాల సుఖాలయ దీపికాద్యుతుల్
నా యెద కోరబోదిక, అ
  నారత సుందరమైన మీ స్మృతి
జ్ఞేయతలో మణీచ్ఛవుల
  సృష్టినె తృప్తి వహింతు నీపయిన్.

ఊహలలో నివాస మిక
　　నుందురు నేటి నిశీధ చంద్రికా
స్నేహము మాసినా, గగన
　　సింధు సుధా పరిషేచనోజ్జ్వల
వ్యూహములన్ మదీయ హృది
　　నూచిన ఈ స్మృతి భావనా గరు
ద్గ్రాహితమై చరించెడు ను
　　దార ముదావహ కాల మెల్లెడన్.

*రచన 1931 నవంబరు 19*
*ముద్రణ భారతి - మే 1932*

## ఖండ శశి..

ఆ పశ్చిమాశా విషాదాంత కావ్యమై
వ్యాపించు కాలమేఘాళిలో పొడచూపి,
ఖండేందు మూర్తి! ఆకాశ కర్పర మెల్ల
నిండు నీ గ్రుడ్డి వెన్నెల ధూమ ధూపమై!
వలదు దయలేని ఆ జిలుగు వెలుగెందేని
కలిపివేయుము పల్లటిలు వార్ధి కెరటాల!
సంపెంగ విరి పైడి చాయలో నా కేమొ
వంపుతేరిన కత్తివలె నుంటి వీ రేయి -
ఖండేందుమూర్తి! లోకముపై కుపితదృష్టి
మండించు ఈ సమున్మాద నాట్య మిదేమి?
ఓ సుధాహృదయ! నిట్టూర్పులై ప్రసరించు
వికల మామక భావ శకలముల్ నీవంక.
కురియింపు మింక నిష్ఠురవృత్తి పోనాడి
హర జటాజూట గంగాంబు శీతలవృష్టి.

*రచన 1932 మార్చి 21*
*ముద్రణ భారతి - జూన్ 1932*

*Spontaniety is lacking with these poems. By a sort of verbal conjuration considerable poetic effect might have been worked up But an emotional sweep and passionate outbursts conducive of a high poetic order are yet to be infused into this poetry*

## దివ్యానుభూతి

సంకుల పయోధర చ్ఛటా పంకిల నిబి
డాంధకార నిర్జన వీథి కాంతరముల
నా చరించెడువేళ ప్రోన్మత్త రీతి,
అవశ మొనరించు దివ్య తేజోనుభూతి
సరసియై, చల్లనై నన్ను జలక మార్చె,
నందన వనీ లతాంత కాంత స్రజమ్ము
గా నొక క్షణమ్ము నా మెడ కౌగిలించె.

కాలభటులు తొందరగా వినీల దీర్ఘ
సూత్రహస్తులు నను డాపి సుమదళీ ప
రీమళావృత మద్గళసీమ కాంచి
తలకి, తలయూచి ఇరులకై తరలినారు

ఇపుడు మేఘముల్ విచ్చిపోయినవి నాకు
గగనమందె కలదు తారకావ్రజమ్ము,
ఇంకనే నిత్య రాకాశశాంకమూర్తి
నై నభోరాజ్యపాళిక లావరింతు

*ముద్రణ ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక*
*ఆంగీరస - 1932-33*

*Not such a big thing to be inserted within artistic borders in the ANDHRA SANCHIKA An effortfully worked up poem. Not obscure because one need not penetrate into the inside of it*

## విద్యున్మాలికలు

బారులు బారులుగ తీరిన
మబ్బు గుబ్బలుల దారుల
దారితప్పి చరించె
ఆ రేయి తరళ సరళేరమ్మదములు

అవి కవిడెందమందు గగురుపొడిచి
ఓరగా,
కోకిలపాట జీరగా
పైరుల పైపయి సోకి చను
తూరుపు గాలి
తీరుగా, కవిడెందమున
తాకి తాకనటుల తరలిపోయిన
ఏ పిన్న భావాలో!
భారంపు సిగ్గు తడియారక
నుడిలో విడుదల పడ జాలక
విహ్వాలించు
ఏ పిన్న భావాల పరిమళ తరంగాలో?
ఆనాటి చకచకిత చంచలావితతి!

స్వర్గ వీథీవిహార తారకలు మారి
శాపవశాన,
మానవుని తోట మడికట్లలోన
ప్రవాసపు బ్రతుకుతోన
నవయుచుండియు నవ్వు వెల్లువలు జల్లు
రకరకాల రంగుల వికచ లతాంత సంతతులుగ
వినువీథిమీద

తమ కోరికలతోడ పరిపూరితములైన
కనుల కాంతి వినయ విస్మృమరతలేమొ
ఆనాటి రేయి నవఘుళించిన
శంపాసహస్ర
నిశావిశాల కుహర విహారములు!

అవి యేమొ!
యామినీవినీల గేహదేహళీ
విష్ణు క్రాంత నితాంత తోరణములా?
ఆటలాడు వేలుపు బాలికల
పావడా అంచుల బంగారు తీవియలా?

కావవి!
వేటకాని కోలలకు కూలి
వేదనల తూలు హరిణాల కండ్లు
జాలికి పురుటిండ్లు -
దిక్కుదిక్కుల కంపిన దీనంపు చూడ్కులే
ఆనాటి
ప్రళయ తాండవ భయంకర సౌదామినులు!

*ముద్రణ భారతి మార్చి 1933*

## గీతిక

కెంజాయ కిరీటముగా
సంజ జగతి పాలించెడు
ఒరులే లేనిది ప్రశాంత
సరస్సముజ్జ్వల తీరము

నాలుగు దిక్కుల గాలులు
బాలుర వలె ఆటలాడు
జిలిబిలి తేటల పాటల
వలె తరగతి ముర్మురించు

ఈ సంజ పరీమళించు
ఇంచుక సేపే చాలును
నీలో నీవే గీతము
లాలాపింపుము హాయిగ

గాలులె వినులే, ఈకెర
టాలును వినులే, చీకటి
లోనీపాట రగుల్కొన
తారలు జన్మించి వినునులే!

*ముద్రణ కల్యాణి, మాసపత్రిక సంపుటి 2, సంచిక 1 ఏప్రిల్ 1933*
*సంపాదకుడు గంటి సూర్యనారాయణ శాస్త్రి విజయనగరం*
*పునర్ముద్రణ 1 వ్యాస సంగ్రహము (ప్రతిభ) నవంబరు 1933*
*శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి సప్తతి తమ జన్మ దినోత్సవ ప్రచురణములు*
*సంపాదకుడు తెలక చెర్ల వెంకటరత్నం*
*2 శ్రీశ్రీ సాహిత్యం, ఒకటి - కావ్య, వచన విభాగం 1970*

## శ్రీశ్రీ విలాసవీధులు

ఆ విలాసపథాలకైన నా మదిలోన
ఏ రుచి స్వప్నాల తారుణ్యరేఖలో
ఏ కౌముదీ కళాలోకనోత్సేకమో
విహరించు లేదలపు లహరీ వృషద్రుచులు

ఆ విలాసపథాల భావనాతీత గీ
తాలాపనోత్సేక హర్ష నాట్యము లెగయ -
జ్యోతిస్సహస్ర విద్యోత ఖద్యోతముల్
నిత్య దీపావళుల్ నిర్మలాదర్శముల్
సత్యలోక సమీర సంచాలనములూగు:

ఆ విలాసపథాల దైవతోత్సవకేళి
కానంద గాన లోహల విపంచీ ధ్వనుల్
ముసురుకొనగా దెసల, రసతరంగము లొలయ
స్వచ్ఛ మాయూర షడ్జశ్రుతుల్ మొరయించు,

ఆ విలాసపథాల కనవరత మీయాత్మ
తలపులో చలిత విహ్వలితమై పలవించు
కాలావధులు దాటి కకుబంతములు దాటి
ఆ విలాసపథాల నావరించదలంచు

*రచన 1931లో ఏమిటి చెప్మా?*
*ముద్రణ నవోదయ - 1946 మే 26*

సందేహ మెందుకు? ఇప్పటి మీ సంతానాన్ని చూస్తూనే వున్నాం
ఇంత ఏపైన పిల్లకి పదిహేనేళ్ళయినా వుండవూ?

*- 'నవోదయ సంపాదకుడు*

## ప్రభాతగానము

అస్మదీయ ప్రఫుల్ల హృదంతరాళ
సంస్థిత పవిత్రతర భావసముదయ ప్ర
దర్శనోత్సుకమతి నౌచుఁ దమక మెసఁగ
దేవి! నీ సన్నిధికి నేగుదెంచినాఁడ!

అత్యుదగ్ర తమిస్ర దుర్వ్యాపృతి ప్ర
భిన్నమానైక శక్తి సంపన్న నిశిత
భానుకిరణ ప్రశస్తమై ప్రాచి తోఁచె
సమయ మయ్యెను నీ పూజ సలుపుకొఱకు

ఏ యనంత ప్రభావ దుర్జ్ఞేయమాన
మానితాచ్ఛ పరంజ్యోతివో నితాంత
నిస్తుల గుణాఢ్యవో యట్టి ని న్ననంగ
గందళించిన హృదయారవింద సుమము
భక్తిపూర్వకముగ సమర్పణ మొనర్తు.
మహిత భవదీయ రూప సంపద్విలాస
నిర్మలాంచిత మందాకినీ తరంగ
నమవగాహనోపార్జిత విమల పుణ్య
మహిమ కారణగళిత కల్మషుఁనైతి
నిమిషకాలమ్ము నిన్ను ధ్యానింపనిమ్ము.

దీర్ఘ హర్షప్రదాయక దివ్య భావ
గీతికా నవ్య రాగ సంకీర్తనమున
నైక్యమయ్యెద త్వన్మనోహర దిగంత
విశ్రుత శ్లోక పరిశుభ్ర వీచికలను.

## కేళి

నిదురవలె, నిదురలో
నొదవు స్వప్నమువలె,
అడుగు సడిలేక నన్నావరించెదవు

గాలివలె, గాలిలో
తేలు సౌరభమువలె
చూచాయ కొలుపకే
సురిగి పోయెదవు

ఎపుడొ నీ ఆగమన,
మెపుడొ నీ నిష్క్రమణ

## ప్రభాతపూజ

నీ పూజవేళ సన్నిహితమైనదిలే! ది
శా పాండిమజ్యోతి వ్యాపించినదిలే!
పదిలముగ నునులేత
హృదయముల ననపూత
పరిమళములే బ్రదుకు పళ్లెరము నిండినవి.
నీ పూజవేళ!

అప్రతిమాన మీ ఉదయ హర్ష సమీర విహారకేళి! నా
కీ ప్రకృతి ప్రతోళికల నెల్లెడ తోచు పవిత్ర భావనా
దీప్ర మధూళులే! అనుమతింపుము నీ చరణాబ్జ సేవకున్
కప్రపు కమ్మవాసనలు క్రమ్మ నొసంగెద నా నివాళులన్

లలితమనస్కుఁడన్, తళతళల్ పొడసూపగనే విహాయసాం
చలముల చంచలాలతల సఖ్యము నాసయొనర్తు, అట్టి నా
అలరుబెడంద నీ ఉదయహాస మరీచులు సాగి సోత్సవో
జ్జ్వల సుఖనీయగానము దెసల్ ప్రసరించగ ప్రోత్సహించెడున్

ఎచట చూచిన నవ్యరుచులు తులకించు ఈ
ప్రకృతి సర్వమ్ము నీ ప్రతిబింబముగ తోచు
నీ పూజవేళ!

ఇది సకలమ్ము సుందరము, నింకను మోహనమున్, ప్రమోదసం
పదలకు తానకమ్ముమ, దివస్సముదార సుహాసినీ ముఖా
బ్జ దరవిలాస హాసరుచి, పౌర్ణమిరేల స్రవించు చంద్రికా
హ్రదఝరి, అవ్యయ వ్యసనహారి సుగంధిల సూనదామమున్

దీని ధరింతునా గళము దివ్య పరీమళముల్ వెలార్పగా?
మౌనముగా మనోజ్ఞ సుషమా వికసద్రుచు లానుచున్. విలో
లానిలమట్లు నిశ్వసనలాలసతన్ ప్రసరించి పోదునా?
స్నాన మొనర్తునా రుచిర జాహ్నవి ఈ నవ భావవాహినిన్?

నా మనస్సున మస్పణ తేజోమయ ప్ర
పంచ మాంగళ్యములు విప్పి పాడుకొనెడు
ఈ సుధాస్మేర సౌందర్య మీ ప్రభాత
సరళ సమయము పూజా ప్రసన్న మయ్యె.

ఈ విధి నేకరీతి ప్రవహించు ప్రమోదఝురాన తేలి పో
గా వలతున్ సుఖమ్మమెయి, కాలకుజమ్మున రాలిపడ్డ తే
జోవిదిత ప్రసూనముగ, సొంపులు గుల్కెడు మేలి ముత్తెపున్
నావగ, నన్ను పెల్లిరియ నల్గెలకుల్ మృదు హాసఫేనముల్

ఎట కనినన్ ప్రహర్షము హసించు ముఖాబ్జములారయన్ సము
త్కటముగ సోకు ఈ సుఖ సుధామయవీచిక, లీ రసాబ్ధికిన్
తటము లెరుంగగాబడవు! ధన్యుడ నీ యుషసి ప్రభావతీ
నటనములో త్వదంఘ్రినలినమ్ముల పూజ యొనర్ప గల్గితిన్

నీ పూజవేళ సన్నిహితమైనదిలే! ఇ
దే పుణ్య లావణ్యమో పొంగినదిలే!

*ముద్రణ భారతి - అక్టోబరు 1940*

## కల్యాణగీతి

విభాతవేళా
శుభానిలంలో
పికాంగనా శ్రా
వ్య కూజితంలో
అమాత్యమణీ! నీ
వివాహమని ఈ
సమస్త లోకం పలికింది

వసుంధరా హ
ర్ష సుందరాస్యం
వసంతహాసం విరిసింది

దిశాంత దివిష
న్నిశాంతముల హృ
ద్య శాంతిగానం కురిసింది
అమాత్యమణీ! నీ
వివాహమని ఈ
సమస్త లోకం చాటింది

ముద్రణ సువర్ణాక్షతలు, 1937

శ్రీ

అమ్మ భార్గవీ, ఒక మాట! అయిన యింట
పుట్టినట్టి నీవిక మీద మెట్టినింట
వెలుగు పండించుకొనుము రవీంద్రనాథ
తేజమున కితోధికమైన దీప్తి గూర్చి!

ఇంకనొక మాట నీకు, రవీంద్రనాథ!
శ్రీమతియు నీవు, నీవు నీ శ్రీమతియును
ధృతిగ నిలిచి, పరస్పరేంగితములెరిగి
తనరవలె చిరమాదర్శ దంపతులుగ!

ఒక శివుడు దయితార్ధ రూపకుడగుచు ధ
రించినాడట రూపులు రెండు మున్ను;
అరమరికలేక మీ వధూవరులిరువురు
నేక మూర్తిగ స్ఫూర్తి రహించ గలరు!

ఈ జగతీ తలమే వి
భ్రాజిత మానస సరోవరమ్మగు నెడలన్
మీ జీవితములు వికస
ద్రాజీవ ద్వయమువలె విరాజిలు గాతన్

రెండు కొమ్మల చిలుక గోరింక జంట
ఒక్క యింట నెయ్యమున గాలూనువేళ
తలిరు సొబగులు మిగులు నొదలలమీద
నలరుగాత మాశీరక్ష రాక్షతాళి!
ఇది శుభమ్

27-4-1975

## పరిణయ పంచరత్నములు

తాతగారి పేరును పెదతండ్రిగారి
నామధేయమున్ ధరియించినావు నీవు!
శ్రీ జగన్నాథ వెంకటేశా! జయమగు
నీల సత్పరిణయ శుభవేళయందు!

పుట్టినట్టి యిల్లగు నెలిసెట్టివారి
వంశమును వెలిగించిన వనిత వీవు!
మెట్టినింటి కేగెద వికమీద నమిత
వినయవతిగ ద్వారం గంగవేణి వగుచు!

గోబ్రాహ్మణ హితకరమై
సుబ్రహ్మణ్యేశు కరుణ శోభిల్లంగన్
చేబ్రోలున మీ పరిణయ
మబ్రముగా జరిగి మమ్ము నలరించవలెన్!

ఒకడు జగన్నాధుడు, మరి
యొకరుడు బలభద్రుడీ మహోదయమందున్
ప్రకటానందము నొందుచు
వికసించవలెన్ నవార విందముల్ వలెన్!

ఆకసమునుండి దేవత లక్షతలను,
కుసుమవృష్టి నప్సరసలు కురియుచుండ,
వైభవోపేతముగ సద్వివాహకాండ
సాగుగావుత మంగళోత్సాహదీప్తి

*16-4-1977 మద్రాసు*
అముద్రితము

# శ్రీనివాసా!

1.

తెలుగువారి దేవరా! శ్రీ వెంకటేశా!
దీనజగతి బ్రోవరా! ఓ శ్రీనివాసా!

2.

ప్రీతి మీర తిరుమలపై వెలసినవాడా!
పిట్సుబర్గుకొండకు వేంచేసిన రేడా!

3.

తెలుగుబాస తీయదనం తెలిసిన నేను
తెలుగుపాట నిలరచించ నిను నుతించినాను

4.

స్ఫారోన్నత సప్తగిరి స్వామివి నీవు
శ్రీరంగం శ్రీనివాసరావును నేను!

5.

ఈ మే నెల ఇరవై తొమ్మిది తేదీని
ఎదపొంగులు వారగ వ్రాసితినే దీని!

పిట్స్‌బర్గ్. అమెరికా
*29-5-1981*
అముద్రితం

# 2. అనువాదాలు

## సంగీతము

భీకరారణ్య సీమనేవేళఁ దిరుగు
క్రూరమృగరాజి కూడ నక్రూరఫణితి
మధుర సంగీత మాలించు మాత్రముననె
సాధుతేజమ్ము వెడలు వీక్షణము తోడ

కడు ప్రసాంతము నందుట గాంచనగును
సుధలు చిలుకు సంగీతమ్ము సోకినంత
కఠిన పాషాణము కూడ కఱగిపోఁబు
వర మనోహర సంగీత గరిమయందు

నెవని కొక్కింత యైనను యిచ్చ పోదొ
విమల మధుర సంగీతమ్ము వినియు కూడ
తన్మయత్వమ్ము నెవడు సుంతయును కనడొ
ఆతడతి ఘోర నీచ కార్యమ్ములకును

కఠిన దుర్దాంద కుటిల సంకల్పములకు
యెన్నడేనియు వెనుకంజనిడడు, వాని
కలుష హృదయాంతరాళమ్ము కాళరాత్రి
పోలె గాఢాంధకార ప్రపూర్ణమయ్యు

వాని ప్రణయమ్ము కృష్ణ శర్వరుల యందు
భయదలగలవారు యమునా స్రవంతి పోల్కి
గాననగు. నట్టి కాఠిన్య మానవులను
నమ్మదెన్నడును గూడ నమ్మరాదు

*('కవికుమారుడు, కవితాసమితి' పేరుమీద రాశాడు)*

*(షేక్స్పియర్ గీతమునకు భావానువాదము)*

*ముద్రణ : ఆంధ్రభారతి మాసపత్రిక సంపుటి 2, సంచిక 12 - మార్చి 1928*

*సంపాదకుడు - తల్లా ప్రగడ రామారావు*

ఉన్నతములు పర్వతపంక్తులున్నవి రమ
ణీయములు లోయలున్న వనేకములు - మ
నోజ్ఞములు వానిలోన మనోజ్ఞమును మ
నోహర మ్మొక లోయ! - దినోదయమున
అచట పొగమంచు లెగసి తారాడుకొనుచు
ఇన మయూఖికా స్పర్శ నశించియును న
శింపకయ పూర్వమున చెట్టు చెట్టు నంటి
ఈదికొని పోవునటుల కాన్పించు! ఇరు కె
లంకులను రమ్యముగ శాద్వలములు వెలసి
పచ్చగా హెచ్చుగా కనుపండువై అ
నేకములు పూలు తొడిగి ఘృణీమనోజ్ఞ
మై వికాసిల్లు! దూరాన అచట ఎచటొ
గిరి ఝరిణి యెండు వడివడి సురిగి సురిగి
వాగులుగ తోగులుగ చిలుపలుగ ఏక
ధారగా శైలసంఘాల దారులంటి
ఒరసి దొరలించి ప్రవహించి హోరుహోరు
మని జలార్ణవ గర్భపాతార్థమై వి
ధూతమై విలోలము విపరీత మగుచు
అల్లకల్లోలముగ సాగు అచట నెచట
అధిక మధురిమ రామణీయకత కలిసి
నవ్వుకొనుచుండు! సృష్టి సౌందర్య మచట
ఆ కృతిం దాల్చినట్లుండు -

అచ్చటి కొక్క
ఆకు కదలని మిట్టమధ్యాహ్నవేళ
ఒక మహాదుఃఖదూషిత, ఒక వయస్య
దారుణ వియోగవేదనా దళితహృదయ
ఒక పరిశ్రాంత కాంత నిట్టూర్పుకొనుచు
ఎన్నటికి కానరాక నశించిన ఒక
వస్తువున కట్లు వెదకుచు వచ్చె! ఆమె
చెక్కుటద్దాల అరుణిమ చెరిగిపోయె

ఆమె విడివాటు పడిన నీలాలకములు
గాలి తాకున మొగముపై కదలియాడె
అచట ఒక రాతి మీదుగా అల్లుకొనిన
తీవ చేరువ చేరి అతి ప్రశాంత
సమయ నిశ్శబ్దమున కరుణముగ స్వీయ
శోకగీతి 'ఇనోనీ' నదీకుమారి
పాడె నిట్లు దిశాంతదీప్త ప్రదోష
శోణరోచిర్వికాస మేచుకొనువరకు

"ఈ మహాదుఃఖగాథ - నా యీ అగాధ
వేదనారోదన ధ్వని వినెడి దెవరు?
నాకుగా జాలిగా నా మనః ప్రగాఢ
విలయ వహ్ని శమింప చింతిలెడి నెవరు?
ఓ శిలామాత! ఓ అనేకోరుసాను
విస్రవర్ఘురిణీ రమణీయ మూర్తి!
ఓ మనః ప్రియ! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరము కలియు మున్నె -
శాంత మధ్యాహ్నసమయ నిశ్శబ్ద మిపుడు
కొండకోనల నెల్లెడ నిండిపోయె -
ఆకు జొంపాలలో కీటకాళి యడగె
అదిగొ తన నీడలో తానె అడగి నీడ
వలెనె ఊసరవెల్లి నిశ్చలత కాంచె -
కలువ పూ సెజ్జ చంచరీకమ్ము చేరె!
నేనె మిగిలితి - నా కనుల్నిండ బాష్ప
కణములే హృది ప్రేమమే కలవు నాకు!
ఇది భరింపగరాక నా ఎడద పగులు
నేమొ వినువయ్యె జీవితమే అదేమొ?
"ఈ మహాదుఃఖగాథ - నా యీ అగాధ
వేదనా రోదన ధ్వని వినుము వినుము!
ఓ శిలామాత! ఓ అనేకోరుసాను
నిస్రవర్ఘురిణీ రమణీయ మూర్తి!
ఓ మనఃప్రియ! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియు మున్నె -
వినుము భూదేవి! గిరులార! వినుడు వినుడు!

త్రాచుపాముల నెలవులు దరులు వినుడు!
ఒక నదీ నాథు ననుగు బుత్రికను నేను -
ఈ విధముగ నా వేదనా జీవితమ్ము
పాటగా పాడి పాటలోపలనె కొంత
శాంతితో, శాంతిలో నా హృదంతరమున
వేడి వెతల నొకించుక విస్మరింతు.

"నాకుగా జాలిగా నా మహాకఠోర
హృదయబాధ శమింప చింతిలుము వినుము!
ఓ శిలామాత! ఓ అనేకోరుసాను
నిస్స్రవన్నిర్ఝరిణీ రమణీయ మూర్తి!
ఓ మనఃప్రియ! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియు మున్నె -
ఆ ఉషఃకాల రామణీయక నిధాన
మసృణ రోచిస్స్రవంతులు మలయువేళ
మంచు టిరులు దూరగిరుల మాటుపరచె.
అపుడు నా దరి నా మనోహరుడు చేరె .
నా మనోమోహనుండు! ఘృణా విహీను
డతనికే నన్ను ధారపోసితిని నేనె!

"ఓ శిలామాత! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియు మున్నె
ఎచటనో పిల్చె నను ప్రవాహిల్లు సెలలు -
ఎచటనో దూరమున ఉషః ప్రచురరుచులు
తుహిన నవబిందు పటలమ్ము తుడిచివైచె.
నా కనులు నేల అప్రయత్నాన వ్రాలె
ఆ మధురమూర్తి నను చేర నరుగుదేర -
చిరుతపులి తోలు తద్భుజశ్రీల చేరి
వ్రేలియుండెను - తత్కోమలాలకములు
కణతలంటెను దేవతాకాంతి కురిసి -
అతని మృదు గండఫలక మోహనత లెగసి
వాయు వీచీప్రసార సౌభాగ్య వశత
ఫేనమాల లుప్పొంగిన విధము చూసె!
నను సమీపించు హృదయమోహనుని కొరకు
నా ఎడద కోరె కౌగిలింతల సుఖమ్ము.

"ఓ మనః ప్రియ! వినుము మృత్యూ గ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియుమున్నె -
అతడు చిరునవ్వి తన పయస్పిత మనోజ్ఞ
మగు కరాంభోరుహము విప్పి యందు చూపె
స్వచ్ఛ సౌవర్ణ వర్ణ భాస్వత్ఫలమ్ము,
తత్సుధా మాధురులు దిగంతాలు నిండె
దాని గని వాని మృదు వచస్వరళలహరి
ఈదితి మనస్సుతో - ఆత డిట్టులనియె!
'నా ప్రణయినీ! ఇనోనీ! సుధాప్రసన్న
మూర్తి! నా ఆత్మరాజ్ఞి! సమ్ముగ్ధనేత్ర!
ఈ ఫలము దీని కనుగొను మిచట ఇదిగొ
అఖిల జగదేక సుందరి' కనుచు కలదు
నీ గమనలక్ష్మితో, భ్రూవినీల రేఖ
కా సుషమతోడ అప్సరః కన్యలైన
ఎవరు సరి నీకు - ఇది నిర్ణయించిరే మొ
దివి సుపర్వులు మోదముద్రితులు నీకు!

"ఓ శిలామాత! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియు మున్నె -
తన ప్రవాళాధరమున ముగ్ధప్రమోద
భరముతో నా పెదవులంటి మరల అతడు
కురియ దొడగెను మధుర వాక్సుధల నిట్లు!
'కనుగొనుము దీని నీ ఫలమ్మును వివాద
కారణమ్మిది నాకలోకమున యందు
దేవతామధ్యమున దీనికై వివాద
పడిరి సౌపర్వరాజ్ఞులు - వారిలోన
ఎవరి కిది తగునని నిర్ణయించుకొరకు
నన్ను నియమించి రైక కంర్యముగ సురలు!
ఆ జగన్మోహినీత్రయ మాగమించు
నపుడు నీవు సమీప గుహాంతరమున
దాగికొని నీ ప్రియుని దేవతాస్వరూప
విధి వినిర్ణేత నరసి గర్వించుకొనుము.'

"ఈ మహాదుఃఖగాథ - నా యీ అగాథ
వేదనా రోదన ధ్వని వినుము జనని!
అదియు మధ్యాహ్నవేళ! విహాయసమున
త్రోవ తప్పెను తెలిమబ్బు తునుక యొకటి -,
అంత హరిదంత సంక్రాంత కాంతి సంత
తి ప్రవాహాలలో సృష్టి తేలిపోవ -
తమ పదన్యాసమున ధరాస్థలమునందు
వేనవేలు నూతన పుష్పవితతి విరియ -
ఒక సుగంధానిలము రేగి సకల లోక
సముదయామోద సమ్మూర్ఛనము ఘటించ -
వనలతా తోరణద్వార భాగ్యలక్ష్మి
స్వాగత మొసంగు ప్రకృతి దీక్షను వెలార్ప -
వెలిగి రచ్చట దివిజరాజ్ఞులు ప్రసన్న
నగ్న దేహప్రదీప్త సౌందర్యవతులు

"ఓ శిలామాత! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియుమున్నె -
ప్రాంత పాదపశాఖాగ్రభాగమందు
వనమయూర కలాపవైభవము వెలుగ
దూరమున మింట జలదమ్ము తొంగిచూచి
మృదు పరీమళ మిహికాంబువృష్టి కురిసె
ఆమె హీరా! సమస్త లోకాధిపత్ని!
స్వర్గ సింహాసన ప్రదేశమ్ము డిగ్గి
అవతరించెడు వేళ సోత్సవ విజృంభ
మాణ మాణిక్యకాంతుల మాలికలకు
నాకవాసుల నీరాజనములు రేగు!
ఆమె యనె నిట్లు తొలుత నా ప్రాణపతికి
'నిఖిల భూస్థలి నీ పాద నికటమందు
నిలిచి, నీ కడకంటి సన్నల చలించి,
నీ నిరంకుశపాలనా నియతి కోర్చి,
గౌరవము - నమ్రభావమ్ము - కలిత భక్తి
నాకరుణ కారణమ్ముగ నీకు చూపు'

"ఓ శిలామాత! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియుమున్నె -
మరల ఆ దేవతారాజ్ఞి మరల మరల
ప్రాభవమ్మును గూర్చియే పలుకదొడగె
'అఖిల కార్యాచరణమున కని సమస్త
జగతి దీనినె వాంఛించు - సర్వకాల
సముచిత ప్రాభవమ్ము, విచక్షణతయు
నే నొసంగెద ఇవియు నెంతేని నీకు!
నా వరమ్మిది - దివిజరాజ్ఞీవరమ్ము!
ఈ గిరిప్రాంతముల సంచరింతువైన
రాట్కుమారుడవే యథార్థముగ నీవు
రాజవే యౌదు నా అనుగ్రహవశాన -
దేవతాంశలు నిన్నింక నావహించు'

"ఓ శిలామాత! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియుమున్నె -
ఆమె యాగెను! నా మనోహరుడు వినుచు
ప్రాభవాప్తిని వాంఛించి - స్వర్ణఫల మొ
సంగివేయగ చేసాపు సమయమందె -
అదె 'అథీనా' సమస్త విద్యాధినాథ!
నిర్ణయవిధాన మంతయు నిలిచి వినుచు
లోచనాంత నటత్శోణరోచు లెగయ
పలికె నిట్లు గభీర వాక్పాటవమున!
'ఆత్మభక్తి, ఆత్మజ్ఞాన, మాత్మనిగ్ర
హమ్ము ఇవి మూడె నిరవద్యమైన ప్రాభ
వమ్ము జీవికి కూర్చును! ప్రభుత యదియు
కోరక అవాంఛితముగ చేకూరు గాన
నియమబద్ధ జీవితమె పో నిర్మలమ్ము!
నియమజీవికి భయము సంధిల్ల దెపుడు!
ఋజుపథ మ్మెల్లవేళల ఋజుపథమ్మె
అగుట ఋజువర్తి తన భవిష్యత్ఫలమ్ము
నరసికొన డిద్దియే జ్ఞాన మనుట తగును.

"ఓ శిలామాత వినుము మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియుమున్నె -
ఆమె యనె నిట్లు మరల 'నీకై విశేష
బహుమతుల చూపి ఆశగొల్పను - బహుళకృ
తుల నొసంగుట యన లంచములె నిజమ్ము!
దాన నా మూర్తి మారదు! కాన నీకు
నా యథార్థ స్వరూప నిర్ణయమే తగును
అదియు నిట్లయ్యు లాభమేదైన నీకు
కావలయునేని నా అనుగ్రహమె కలదు!
నా మహాశక్తి నీరక్తనాళపూర్ణ
మగుచు నీ నాడులంజొచ్చి అమరతేజ
మున భయంకర జీవితమును తరించు
వేళ నియమ ద్రఢిమ నిచ్చు - స్వేచ్ఛ నిచ్చు!'
అని వచింపగ నా మనోహరుడు కొంత
తడవు యోచించె - నే ప్రమోదమ్ముతోడ
ఆమెకే దాని నిమ్మని అరచినాను
కాని అది వాని చెవి చేరనైన లేదు.

"ఈ మహాదుఃఖగాథ - నా యీ అగాధ
వేదనా రోదన ధ్వని వినెడి దెవరు?
నాకుగా జాలిగా నా మనః ప్రగాఢ
విలయవహ్ని శమింప చింతిలెడి దెవరు?
ఓ శిలామాత! ఓ అనేకోరుసాను
నిస్స్రవ ఝ్ఝరిణీ రమణీయ మూర్తి!
ఓ మనఃప్రియ! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియు మున్నె -
ఆర్ద్ర డిండీరపూర నవ్య ప్రకాశ
తల విధాన తనూరుచు ల్కలసికొనగ.
విరిసి వెలిగిన వేనవేల్విరుల సరుల
నడుమ మృదు పాదకాంతులు కడలుకొనగ
అచటి కరుదేరె ప్రేమరాజ్యైక రాజ్ఞి!
దివ్య మోహన దరహాసదీప్త నేత్ర!

"నాకుగా జాలిగా నా మహాకఠోర
హృదయబాధ శమింప చింతిలుము వినుము!
ఓ మనః ప్రియమాత!! మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియు మున్నె -
ఆమె నవ్విన చిరునవ్వు టలలలోన
తన భవిష్యద్విజయరేఖ తాండవించ
నా ప్రియుని చెంతచేరి సన్నని మనోజ్ఞ
కంఠమున 'ఈ సమస్త లోకమునయందు
అమిత లావణ్యవతిని ప్రేయసిగ నీకు
నే నొసంగెద - ఇదియె వాగ్దాన' మనియె.
అని హసించిన దామె ! భయమ్ముచేత
మూసికొంటిని నా నేత్రములను నేనె!
కనులు విచ్చి చూచినయంత కరముసాచి
ప్రియుడు కననయ్యె - క్రోధ విస్ఫీత నేత్ర
రక్తరోచులతో నాకరాజ్ఞి కదలి
నీరదప్రతిసీరలో నిలిచిపోయె.
నేనె మిగిలితి - నాడుగా నేటివరకు
నే నొకర్తు వియోగ తమోనిలీన
జీవిత విషాదహతుల శుష్కించిపోయి.
ఏ నొకర్తు వియోగ దవానలమున
హృదయ మెరియగ ఇట్లె నశించిపోదు!

"ఓ శిలామాత! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియుమున్నె -
అమిత లావణ్యవతిని ప్రేయసిగ నతడు
వలచునా? నేను లావణ్యవతిని కాన?
అతడే ఇట్లు పలుమారు లనుటలేద?
నా సురూప ప్రభా మనోజ్ఞతలయందు
వనచరమ్ములు ముగ్ధ విభ్రాంతి కాంచి
ఓసరిల్లుట తెలియదు! హో సఖా! క
ఠోర హృదయుడ! నా ప్రేమపారవశ్య
భరమున త్వదీయ గాత్ర మీ పల్లవమృదు
కరయుగమ్మున పెనగొన్న తరుణమందు

నీవు కురిసిన సురుచిర శ్రావణాబ్ద
వర్షధారా నికాశ చుంబన సహస్ర
మధురిమము లింతలోననే మరచినావె!

"ఓ శిలామాత! వినుము మృత్యూగ్రవదన
గర్భమున నా శరీరమ్ము కలియుమున్నె -
ఎరుగడే నా మనోహరు డీ పవిత్ర
హరిత శాద్వల భూభాగమందు ఇచట
ఈ శిలావేది కూర్చుండి ఎన్నిమార్లు
ప్రణయభాషల నెన్నెన్ని పలికినాడొ?
ఎరుగడే నా కరమ్మంటి ఎన్నిమార్లు
శీత హర్షాశ్రు సిక్తమ్ము చేసినాడొ?
ఈ మదీయోష్ణ బాష్పమ్ము లివియు నాటి
మోద వాఃపూరములు ఎంత భేద మకట!
ఓ ధరాదేవి! నా మనఃఖేద భార
వహమున ఎంతగా నీకు బరువొ నేను!
మృత్యుదేవీ! సహస్ర జిహ్వాకలతోడ
జీవిత వికాసముల గ్రసించెదవు నీవె!
ఈ వియోగ విషాద భారావిలమగు
నా మనఃపీఠిపై నిల్చి నాట్యమాడి
ఓ మృతీ! ఓ మృతీ! నీవె ఈ మదీయ
జీవ దీపిక నార్పి వేసెదవు రమ్ము!

*రచన 1928 సెప్టెంబరు 27 నుండి 1928 అక్టోబరు 14 వరకు.*
*ముద్రణ ఆంధ్రపత్రిక శుక్ల సంవత్సరాది సంచిక 1929*

*This is a translation of Tennyson's Oenone by no means complete It is appealing at places, nowhere dull and the flow is rather smooth My pain is said to be recompensed by at least the partial satisfaction it gave me Although I cannot say that I have glorified Tennyson in this translation, I feel that I have not insulted him*

## శోకదేవి

జ్వలియించు పూగుత్తి, పరిమళించెడు మట్టి,
దుఃఖిత ప్రణయినీ! తొలగి చను నన్నియును
సాంధ్య నిస్తబ్ధ తేజస్సు శాంతించు,
విలపించగా మానివేయును గాలి,
బ్రదు కొక్క కల్పనా కథవోలె ముగియు.

జీవితంపు గులాబి కావిరేకుల నడుమ
సరళానిలము గాగ మరణ మెప్పుడు వీచు,
బాధావిలానేకవర్షముల్ కడువ
శాంతి నెచ్చెలియట్లు సముఖాన తోచి
జాలిహస్తాల బాష్పమ్ముల తుడుచు

మృతిలోన విధికృపన్ ప్రతివస్తువును ముగియు
ఆశయు, వలపు, ఈ అలతి మనుజశ్వాస,
కాంతాధరములు, సిగ్గరి సందెచుక్క
ఇకముందు మడిసిన విపుడు జీవించి
వరమనోజ్ఞములైన వస్తువు లెల్ల

ఒక తెల్లనగు మంట, ఒక కెంపు మంటయున్
శాంతి వేదనల ప్రోజ్జ్వల కీల, లా నడుమ
వస్తువుల్ కడ చనున్ వచ్చిన దారి.
ఇవి యెల్ల నడచిపోయిన అనంతరము
ఆత్మ స్వీయోషస్సునందు జ్వలించు

ఎరుపు మంటకు పైన, తెలుపు మంటకు పైన
నీడయే లేని ఉన్నత దివ్య తేజమ్ము
మనుజ ఘోషల కందుకొనరాని నిబిడ
నిశ్శబ్దముననున్న నక్షత్రవేది
నేకాంత రాజ్యమ్ము నేలు సమ్రాట్టు.

దుఃఖిత ప్రణయినీ! తొలగి చను నన్నియును -
నా తీవ్ర భావపుం జ్వలిత ప్రసూనమ్ము.
నీ యక్షిణీ తనువు తీయని మట్టి,
మనప్రేమ దేని కొమ్మలు కాంచె నట్టి
మసకయౌ జీవనోన్మాదంపు తరువు.

తొలగు నన్నియు ఒక్క తుది అరవులోన
నీరమ్ము, హరిణమ్ము, నీవు నేనును కూడ,
అలసముల్ ప్రాకు నీడలు మనమీద!
కల లెరుంగని, అమోఘ, మగాధమైన
ఒంటరి నిద్రలో నురలును బ్రదుకు

నిష్ఠురాహతహృదీ! నీ కేడ్వ నికనేల?
బేల కనులార! మీ కేల అశ్రువులు మీ
బాధారహస్య గహ్వరము లందుండి?
ఆనంద మిక మీద!! వాన విధాన
గతియించి మగిడి రాగలుగరు మీరు.

*రచన 1932 ఏప్రిల్ 2*

*తొలిముద్రణ భారతి - 1932 అక్టోబరు*

*ముద్రణ తెలుగు స్వతంత్ర - 1950 నవంబరు 24*

*Translation of an extract from H Chattopadhyaya's* Garden of Isolation *The first draft was done with very much ease Subsequent alterations were inserted to heighten the effect of the poem*

## కోల్పడిన ప్రేమకు

కనులు విచ్చి నీదు సమాధి కాంచలేను
అట గులాబి తీయనిదెంతయైననేమి!
నా అడుగులంట పర్వు శూన్యతను కడుగు
పెనుతరంగాల మ్రోతల వినుటె చాలు!

ఊరట వహింతునా? మహాదూరమున వ
సింతు వేమొ జీవాత్మవై. ఏదొ అగాధ
నీరవత ఆవరించగా తారకలకు
చుట్టు నెలకొను నిశ్శబ్ద మట్టిది నిను

శీతలినివి నీ వైతివి! ద్యోతలాన
నివసముందువు నీ యంత నీవె, అచటి
అమిత మతిమంతమైన నీ హాయిలోన
పరిహృతమ్మె హృదున్మత్తభావమెల్ల

కానియైన నొక్కొకవేళ కాంచెదీవు
కడచు నొక్క నిశ్వాసమ్ము, గాఢ బాధ
చకితవౌదు తెరువంబడి స్వర్గమందు
ద్వారమొకడు వెన్వెంట మూతపడినట్లు.

సంచలింతు నీ వింత ప్రశాంతములగు
ప్రార్థనాగీతు లచ్చటి వాగిపోవు
సగము స్మరియింతు నీవొక్క క్షణము నన్ను;
మరల నీ శాంతిలోనికి మరిగి పోదు.

ఐన నయ్యయో! ఇకపై ననారతమ్ము
నీదు చూపు, నవ్వు, హొయలు, నీ గళమ్ము,
వివిధ తావక భూలోక విభ్రమములు
పోవు నెన్నెన్ని చినిచిన్ని ముచ్చటలవి

కాన తావకీన సమాధి కాంచలేను
అట గులాబి తీయనిదెంతయైనకాని,
నా అడుగులంట పర్యవశూన్యతను కడుగు
పెను తరంగాల మ్రోతలే వినగవలతు.

*మూలం  స్టీఫెన్ ఫిల్లిప్పు గీతం*

*ముద్రణ  ఆంధ్రభూమి 1933 మే తొలిసంచిక*

## బాల్యం

చాలా చిన్నవాడినిగా
నేనుండిన కాలం కలదు
నా శరీరమంతా అప్పుడొక
అడుగున్నర మాత్రం!
తీయగా అది తలుచుకుంటే
కన్నీళ్ళు స్రవించు;
అందుకనే హర్షముతో
అది నేను స్మరింతు.

2

తల్లి చల్లని చేతులలో
ఆడుకున్నాను నేను;
నాయనగారి మోకాళ్ళమీద
గుర్రపు స్వారీ చేశాను
దుఃఖాలు, ఉద్రేకాలు, భయాలు,
అన్నీ ఒకలాగే ఉండేవి
బంగారం, సంస్కృతం, ప్రణయం,
అవన్నీ తెలిసేవి కావు

స్వర్గంలో మొనలవలె
చుక్కలు పొడుచుట
చూశాను; రెక్కలుంటే
బాగుండును వాటిని పట్టు
కోవచ్చు అనుకున్నాను.

4

లంకలవెనుక చంద్రుని కాంతి
హరించి పోవడం చూసి
అనుకునే వాడి నిట్లా
"అక్కడ నే నుంటే చంద్రుణ్ని
దేనితో చేసేరో తెలిసేది,
ఎంత పెద్దగా, గుండ్రంగా అందంగా
చంద్రుడుంటాడో తెలిసేది "

5

పశ్చిమాకాశంనుండి
ఆశ్చర్యంగా చూశాను
దేవుని యొక్క సూర్యుణ్ని.
రాత్రిపడేటప్పుడు సముద్రపు
అపరంజి ఒడిలో క్రుంకేవాడు
అయితే మళ్ళీ తెల్లారగట్ల లేచి
తూర్పు స్వర్గాన్ని ఎర్రని
వెలుగుతో చిత్రించేవాడు.

6

ఎవడు నన్నూ మీది సూర్యుణ్నీ చేశాడో
ఆ దేవుణ్ణి, పరమపితను స్మరించాను
తన చేతినుండి ఆకాశంపై
గుమిగా రాలిపడే
దట్టంగా గ్రుచ్చబడ్డ దివ్య మౌక్తికాలు
ఎవడు చేశాడో ఆతణ్ణి!

7

కృతజ్ఞతనపు భక్తితో
అమ్మ చెప్పిన ప్రార్థన ఉచ్చరించాను
అమాయకపు పెదవులతో;
"దేవా! సరళస్వభావా!
ఎల్లప్పుడూ జ్ఞానం కలిగి
మంచిగా బ్రతికి
నిన్నే అనుసరించని"మ్మని.

8

ఇలాగే ప్రార్థించాను తండ్రికోసం
తల్లికోసం, చెల్లికోసం,
ఊరిలో ఉన్న ఎల్లరికోసం,
నేనెరుగను కాని రాజుగారికోసం;
పెద్దకాలంచే క్రుంగి
అసురసురని అటూ ఇటూ తిరిగే
భిక్షుక సోదరునికోసం

9

అవి నశించాయి, ఆ నా బాల్య
హర్ష దినాలు నశించాయి
అంత ఆనందమూ పోయింది
నే నెరిగిన అంతశాంతీ పోయింది
ఇప్పుడు నాకు మిగిలినది
ఎంతో ప్రోది చేసుకున్న
అప్పటి సంస్మృతి మాత్రం!
ఓ ప్రభూ! దీనిని కూడా నేను
ఎప్పుడూ కోల్పోవకుందునుగాక.

*ముద్రణ కల్యాణి - అక్టోబరు 1933*

*(డేనిష్ కవి Jens Baggesen గీతానికి ఇంగ్లీషు ద్వారా తెనుగు)*

## బహిష్కృతుడు

సంజపడి చీకటులు మూగుసమయమందు
దారిప్రక్క ఏకాకిగా కూరుచున్న
ఒక బహిష్కృత తేజస్వి నోరసికొనుచు
తొందరగ దాటిపోవుచుందురు జనాళి.

ఆ జనుల్ తమ దీ ప్తగేహమ్ము చేరి
ప్రియకుటుంబముతోడ నవ్వి యవి పల్కి
తీయతీయపల్కుల తరితీపులందు
పిలువ వై చెద రల బహిష్కృతుని మాట

కాని రాగబంధమ్ములు కదలిపోయి
జీవయాత్ర కాశ్వాసాంత మావహిల్లి
పరుగు కడముట్టిపో, సుహృద్వరుడః యనుచు
వ్రాలుదురు వారు వెలిపడ్డవానిమీద.

మూలం.ఎ ఇ

ముద్రణ ఆంధ్ర విద్యార్థి-అక్టోబరు 1934

*పునర్ముద్రణ భారతి ఫిబ్రవరి 1938*

## ప్రవాసులు

దేవతలు విచిత్రాకృతుల్ తీసికొనిరి
పల్లెటూళ్ళలో సూకరపాలకులుగః
కాని వారల మురికి మొగాలయందె
దివ్య తారకాస్నిగ్ధదీధితులు మెరయు

వికల ధూసర గగనవాటికల క్రింద
తప్పులయికూడ పూర్తిగా దాచలేరు
తమ పతిత దేవతావైభవము, స్వకీయ
దివ్యశోభ, కన్నులయందు దివిషదగ్ని.

మట్టిగోడల గుడిసెలమధ్య రేల
ఇరికిపడియును వారికే ఎరుగరాక
రాజదండ కిరీటధారణ మొనర్చి
గద్దెనుండి గద్దియ కట్టె కదులుచుంద్రు.

మూలం ఎ ఇ

*ముద్రణ . భారతి ఫిబ్రవరి 1938*

## తిరుగుబాటు

అల సూర్యుడనెడి ఉజ్వల దివ్యనౌక
ఇటు నే ప్రయాణించు ఈ పాతదోనె
ఏక రహస్యాజ్ఞనే తెలిపోవు
ఏక ప్రవాహననే ఈదులాడు.

నక్షత్ర నౌకలున్ నా ఆత్మనావ
ఇంద్రజాలిక పర్వతావళి దాటి
దూర సముద్ర వర్తుల రేఖదాటి
మూర్ఛిల్లు నౌక స్వచ్ఛ ముకురార్ణవమున

రండి మీ సీళ్ళు విప్పండి చెప్పండి
ఏ సాహసిక యాత్ర ఇది మేమొనర్తు
మేదేవనగరి సాధించుట కొరకొ
జన్మధామ శ్యామ సస్యవీథులకీ?

*మూలం ఎ ఇ (?)*

*ముద్రణ భారతి, ఫిబ్రవరి 1938*

## చెలువు

ముకురమున నన్ను నేను చూచుకొనునపుడు
నా ప్రసక్తిగా కన్యము నాకు లేదు.
చెరువులో మాత్రమేను చూచితిన యేని
వింత లెన్నెన్ని కాని కాన్పించు నాకు.

ముకురమున కానబడు నాకు మూర్ఖుడొకడు
చెరువులో జ్ఞాని కానిపించెడిని నాకు

*మూలం: Davies*

*శ్రీశ్రీ సాహిత్యం 1 కావ్య, వచన విభాగం 1970*

# ఫుట్ నోట్స్

★ **వేణుగానము** . ఇది శ్రీరంగం శ్రీనివాసరావు, కేతవరపు కృష్ణమూర్తిగారి పేర్లతో అచ్చుపడి ఉంది

★ **భావనాపథి** 'గృహలక్ష్మి'లో దీని శీర్షిక "ఊహాపథి" కొద్ది మార్పులు కూడా ఉన్నాయి

★ **ఖండశశి** 1929 మే 13 న ఖండేందుమూర్తి, చవితిచంద్రుడు అనే శీర్షికలు మార్చి రాసిన ఈ పద్యం రచయితకే నచ్చుబాటు కాలేదు అందుచేత దీన్ని పూర్తిగా తీసి వేసి మూడేళ్ళతర్వాత సరికొత్తగా రచించవలసి వచ్చింది మొదటిది గేయం మాత్రమే

★ **కల్యాణగీతి** · బెజవాడ గోపాలరెడ్డి (1907-`90) గారి అయిదు రోజుల పెళ్ళి మద్రాసు (8-5-1938) లో జరిగింది అప్పుడాయన ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని కాంగ్రెసు మంత్రి వర్గంలో ఆర్థిక శాఖామంత్రి ఆ పెళ్ళికి తెలుగు నాటనించి కవులు తరలివచ్చారు పద్యాలు చదివారు విశ్వనాథ సత్యనారాయణ గోపాలోదాహరణం అంటూ 108 పద్యాలు రాశారు వీటన్నింటిని కలిపి 'సువర్ణాక్షతలు' అనే పుస్తకంగా నవ్యసాహిత్య పరిషత్తు ప్రచురించింది

★ **శ్రీ** · సినిమా నిర్మాత ఎమ్ ఎస్ రెడ్డి గారి కలం పేరు మల్లెమాల కొన్ని సినిమా పాటలు రాశారు వీరి కూతురి పెళ్ళికి శ్రీశ్రీ రాసిన పద్యాలివి శ్రీశ్రీతోపాటు పుట్టపర్తి, దేవులపల్లి, కరుణశ్రీ, ఆత్రేయ, ఆరుద్ర, నారాయణరెడ్డి, దాశరథి, శేషేంద్ర శర్మ, ఉండేలమాలకొండారెడ్డి, కొండమాచార్య, శివారెడ్డి, మల్లెమాలలు కూడా కవితలు రాశారు వీటన్నింటినీ కలిపి కల్యాణవీణ (నవజీవన రాగ సంపుటం) గా ప్రచురించారు పెళ్ళి (27-4-1975న) మద్రాసులో జరిగింది

★ **పరిణయ పంచరత్నములు** . ద్వారం జగన్నాథరావు (1909-72) గారు విశాఖపట్నం నివాసి శ్రీశ్రీకి చిన్ననాటినించి స్నేహితుడు ఇంగ్లీషు సాహిత్యం బాగా చదివాడు ఆయన తమ్ముడు బలభద్రరావు ఈయన కొడుకు జగన్నాథ చినవెంకటరెడ్డి నాయుడు ఇతని పెళ్ళికి శ్రీశ్రీ రాసిన పద్యాలివి పెళ్ళి చేబ్రోలు (ఏలూరు - తాడేపల్లి గూడెం మధ్య) లో జరిగింది అక్కడ సుబ్రహ్మణ్యేశ్వర ఆలయం వుంది

★ **ఇనోని** Tennyson, Alfred (1809-92) ఇంగ్లీషు కవి,1833లో ప్రకటించిన Poems సంపుటిలో Oenone కావ్యం ఉంది. వర్డ్సువర్తు తదనంతరం ఆస్థాన కవి అయాడు (1850)

Oenone గ్రీక్ పురాణ కథ ప్రకారం, ఇనోనీ అనే వనదేవత (Nymph) మౌంట్ ఇడా నివాసిని ఒక గొర్రెల కాపరిని ప్రేమించి అతనితో సౌఖ్యం అనుభవిస్తుంది కాని, అతడు నిజానికి ట్రాయ్ (Troy) రాజైన ప్రియామ్ (Priam) పుత్రుడు పేరిస్ (Paris) అని తెలియదు పేరిస్ ఆమెకు ద్రోహం చేసి పరిత్యజిస్తాడు దేవతా కాంతలందరిలోనూ మిక్కిలి సౌందర్యవతిగా ప్రణయాధిదేవతను ఎన్నికచేసి, ఆమె ద్వారా భూలోక సుందరీ మణులలో కెల్ల సుందరి యైనదానిని పొందగలవని వరం పొందుతాడు హెలెన్ (Helen) ను బలాత్కారంగా తీసుకు వచ్చి ట్రోజన్ యుద్ధానికి కారణ భూతుడౌతాడు యుద్ధంలో తీవ్రంగా గాయపడి చనిపోనున్న వేళ, ఆ గాయానికి చికిత్స చేయగలిగి కూడా ఇనోనీ నిరాకరిస్తుంది పేరిస్ చనిపోయాక, పశ్చాత్తాపపడి దుఃఖంతోటి ఇనోనీ ఉరి పోసుకుంటుంది టెన్నిసన్ కవి ఇనోనీ గాథను చెబూని Oenone మాత్రమేగాక The Death of Oenone కూడా రచించాడు మొదటిదే, శ్రీశ్రీ రచనకు మూలం

★ శోకదేవి .హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ 2-4-1898 జననం, హైదరాబాదులో డాక్టర్ అఘోరనాథ్ కుమారుడు సరోజినీ నాయుడు ఈయన సోదరి దాదాపు 25 పుస్తకాలు ప్రకటించాడు ఇంగ్లీషులో The Feast of Youth, 1917, The Wizards' Mask, 1918, Cross Roads, 1925 (అన్నీ కావ్యసంకలనాలు), Life and Myself అనే ఆత్మచరిత్ర 1942, కాకుండా నాటకాలు కూడా రాశాడు 23-6-1990 న చనిపోయాడు

★ బాల్యం · Baggesen, Jens Immanuel (1764-1826) డెన్మార్కుదేశపు కవి జర్మన్ భాషలో కూడా రచించాడు సర్వతోముఖ ప్రజ్ఞావంతుడని పేరు. కాల్పనికోద్యమం ప్రవేశిస్తున్నప్పుడు దాన్ని నిరోధిస్తూ వాదంచేశాడు ప్రాచీన (classical) సంప్రదాయాభిమాని. ఈనాడు ఆయన కీర్తి లఘు, లలిత హాస్య, అవహేళనాత్మక కావ్యరచనలపై ఆధారపడి ఉన్నది An Anthology of World Poetry లో అచ్చుపడిన బాగెసన్ రచన శ్రీశ్రీ అనువాదానికి మూలం.

★ బహిష్కృతుడు . A E - George William Russell (1867-1935) అనే ఐరిష్‌కవి యొక్క సుప్రసిద్ధమైన కలం పేరు ఐరిష్ జాతీయ పునర్వికాసంలో యేట్సు (W B Yeats) సహచరుడుగా గొప్ప కవిత్వం రచించాడు

★ ప్రవాసులు యేట్సు దృష్టిలో ఏ ఇ కావ్యాలు "The most delicate and subtle that any Irishman of our time has written" ముఖ్యంగా మార్మికవాద ధోరణిలో రచించాడు Dierdre అనే నాటకం, The Divine Vision (1904), The Renewal of Youth (1911), Imaginations and Reveries (1915), Enchantment and Other Poems (1930) అనే కావ్యాలూ ఇతని ముఖ్యరచనలు

★ చెఱువు · W H Davies . (1871-1940) ఇంగ్లీషుకవి అమెరికాలో చెడదిరుగుతూ చిల్లర వస్తువుల నమ్ముతూ, ఇంగ్లాండులో వీధిగాయకుడుగా సంచరిస్తూ కొన్నేళ్ళు గడిపాడు చెరసాలలో పడి అక్కడే The Soul's Destroyer అనే పేరుతో కావ్యసంకలనం వెలువరించాడు. 1908లో The Autobiography of a Super-Tramp రచించాడు. Nature Poems and Others కూడా ఇతని రచన Collected Poems of W.H Davies 1929లో వెలువడింది



# ఇంతవరకు అచ్చయిన శ్రీశ్రీ పుస్తకాలు

1. పరిణయ రహస్యం. వి.ఆర్ ప్రెస్, విశాఖపట్టణం 1924
2 ప్రభవ. కవితాసమితి. విశాఖపట్టణం 1928
3 వారం వారం, ప్రతిమాబుక్స్, ఏలూరు 1946
4 సంపెంగతోట ప్రజాసాహిత్యపరిషత్తు. తెనాలి 1947
అనువాదంChekhov Cherry Orchard
5 మహాప్రస్థానం. నళినీకుమార్, మచిలీపట్నం 1950
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్-విజయవాడ, దాదాపు 20 ముద్రణలు 1952 to 1984
శ్రీశ్రీ స్వంతదస్తూరి స్వంతగొంతుక విదేశాంధ్ర ప్రచురణ-లండన్ 1981
6 అమ్మ (కారల్ చాపెక్ Mother నాటకం అనువాదం)
అరుణరేఖ ప్రచురణలు-నెల్లూరు. సోషలిస్టు పబ్లికేషన్స్-విజయవాడ 1952 1967
7 మేమే. త్రిలింగ పబ్లిషర్స్-విజయవాడ, 1954
8 మరో ప్రపంచం, రేడియో నాటికలు, సారధి పబ్లికేషన్స్-సికిందరాబాద్ 1954
అరుణరేఖ ప్రచురణలు-నెల్లూరు 1956
9 1+1=1 (అదే పుస్తకం పేరుమార్పు) రేడియో నాటికలు 1964, 1966
విశాలాంధ్ర ప్రచురణాలయం-విజయవాడ 1979, 1984, 1987
10 Three Cheers for Man, Abhyudaya Prachuranalu-Madras 1956
11 చరమరాత్రి కథలు, గుప్తాబ్రదర్స్-విశాఖపట్నం 1957
12 మానవుడిపాట్లు (మైఖేల్ పోలఖోవ్, అనువాద నవల)
విశాలాంధ్ర ప్రచురణాలయం-విజయవాడ 1958
13. Soudamini, Puripanda's Poems translated into English,
Addepally & Co. - రాజమండ్రి 1958
14 గురజాడ, మనసాహితి-హైదరాబాద్ 1959
15 మూడు యాభయిలు, విశాలాంధ్ర ప్రచురణాలయం-విజయవాడ 1964
16 ఖడ్గసృష్టి. విశాలాంధ్ర ప్రచురణాలయం 1966, 1984
17 వ్యూలు, రివ్యూలు-ఎమ్వీయల్ మినర్వాప్రెస్-మచిలీపట్నం 1969
18 శ్రీశ్రీ సాహిత్యం, 5 సంపుటాలు, షష్టిపూర్తి సన్మానసంఘం-విశాఖపట్నం
ఎడిటర్ కె వి ఆర్ 1970
19 Sri Sri's Miscellany, English Volumes Editor K.V.R
షష్టిపూర్తి సన్మానసంఘం, విశాఖపట్నం 1970
20 లెనిన్, (మయకోవిస్కీ కావ్యం అనువాదం) ప్రగతి ప్రచురణ-మాస్కో 1971
21 రెక్క విప్పిన రివల్యూషన్ (Beginning of the end అనువాదం)
ఉద్యమసాహితి-కరీంనగర్ 1971
22 వ్యాసక్రీడలు, నవోదయ పబ్లిషర్స్-విజయవాడ 1973
23 మరోమూడు యాభయిలు, ఎమెస్కో-సికింద్రాబాద్ 1974
24. చైనాయానం, స్వాతి ప్రచురణలు-విజయవాడ 1980
25. మరోప్రస్థానం-విరసం 1980
26. సిప్రాలి-అమెరికాలో ఫోటోకాపి 1981
27 పాడవోయి భారతీయుడా, శ్రీశ్రీ ప్రచురణలు-మద్రాసు 1983
28 శ్రీశ్రీ వ్యాసాలు-విరసం 1983
29 New Frontiers-విరసం 1983

ఇవేకాక ఎక్కడా అచ్చుకాని శ్రీశ్రీ రాతప్రతులూ, ఉదాహరణకు "బెండయ్యాగారిగది". కృష్ణా కృష్ణ నాటకాలు - పత్రికల్లో అచ్చయి, పుస్తకరూపంలో రాని రచనలు చాలా వున్నాయి అన్నీ కలిపి మళ్ళీ వర్గీకరించి శ్రీశ్రీ సంపూర్ణ సాహిత్యం మొత్తం 20 సంపుటాలుగా విరసం ప్రచురిస్తున్నది.

# పరిణయ రహస్యము






1924 సంవత్సరంలో

(శ్రీశ్రీ తన పధ్నాలుగో ఏట)

రాసిన

డిటెక్టివ్ నవలిక

# ముందూ వెనక

అచ్చులో శ్రీశ్రీ తొలి రచన ఈ 'పరిణయ రహస్యం' అప్పుడు శ్రీశ్రీకి పద్నాలుగేళ్ళు కొన్నాళ్ళకి పెళ్ళయింది అనుకున్న పెళ్ళి ముహూర్తం తప్పినా, పెళ్ళి కూతురు మాత్రం మారలేదు ఆమె పేరు మూలా వెంకటరమణమ్మ ఈమెని చేసుకోవడం అమ్మాయమ్మ (శ్రీశ్రీ అమ్మమ్మ) కిష్టం లేదు ఆరుద్ర నాన్నకి నాయనమ్మ ఈ అమ్మాయమ్మ ఈ పెళ్ళి తప్పించడానికి ఒక పదకం వేసింది నరసింగరావు (ఆరుద్ర నాన్న) ని తోడిచ్చి శ్రీశ్రీని బారువా పంపేసింది అన్నా కరెనినా నవల్ని శ్రీశ్రీ చేతిలో పెట్టాడు నరసింగరావు ఆ నవల చదువుకుంటూ రైలెక్కాడు శ్రీశ్రీ తన పెళ్ళి అని శ్రీశ్రీకి తెలుసు పెళ్ళి మీదగానీ, పెళ్ళి కూతురి మీదగాని శ్రీశ్రీకి ప్రత్యేకంగా ఇష్టాయిష్టాలంటూ ఏమీ లేవు మేనబావతోపాటు రైలెక్కాడు దూరంగా వున్న బారువా వెళ్ళాడు

తన కొడుకు ఏమయిపోయాడో అని వెంకటరమణయ్య (శ్రీశ్రీ నాన్న) తల్లడిల్లిపోయాడు తన తమ్ముడు సోమనాధం (భీమునిపట్నంలో పోలీసు సబ్ ఇన్స్పెక్టరు)ని శరణు వేడాడు సోమనాథం హుటాహుటిన గుర్రం మీద విశాఖపట్నం వచ్చాడు ఇందులో విలన్ అమ్మాయమ్మని పసికట్టాడు ఆమెని బెదిరించే సరికి శ్రీశ్రీని బారువానించి వెనక్కి రప్పించింది కొన్ని రోజుల తరవాత రామతీర్థాలు (విజయనగరంకు 20 కిలోమీటర్లు)లో పెళ్ళి జరిగింది

ఈ నవల అచ్చయినాకే శ్రీశ్రీ పెళ్ళి జరిగింది కనక, పెళ్ళి ప్రభావం నవల మీద లేదని చెప్పవచ్చు అప్పటికింకా శ్రీశ్రీ ఊహలు విప్పారలేదు నవలలో ఇటు గోదావరి, అటు నాగావళి దాటలేదు కాని నిజజీవితంలో నాగావళి దాటి 'సిక్కోలు' చివరికి వెళ్ళాడు ఇది గమనించవలసిన అంశం విశాల దృక్పథం అలవడ్డానికి ఎవరయినాసరే లోకంలోకి వెళ్ళవలసిందే గిరీశం అన్నట్టు 'లోకం అంటే గంజ గుంట కాదు'

పరిణయ రహస్యం పుస్తకం గురించి శ్రీశ్రీ చాలాసార్లు చెప్పేవాడు ఎలాగయినా దానిని దొరకబుచ్చుకోవాలని కుతూహలపడేవాడు కూడా విశాఖ రచయిత 'మసూనా'గారి (-మండా సూర్యనారాయణ - విశాఖపట్నం) పూనికవల్ల ఇది మాకు దొరికింది వారికి మా కృతజ్ఞత ఈ నవల కాపీ మాకు దొరగ్గానే ఆంధ్రజ్యోతి దినపత్రిక (ఏప్రిల్ 10, 17, 24 తేదీలు 1994) లో అచ్చువేశారు పత్రికా సంపాదకులు నండూరి రామమోహనరావు గారికి మా కృతజ్ఞత.

శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం ప్రచురణలో సాహిత్య సంస్థగా విరసం కృషిని ఆదరిస్తారని ఆశిస్తున్నాం

విశాఖపట్నం
30 09 1999

చలసాని ప్రసాద్

# పరిణయ రహస్యము

మొదటి ప్రకరణము

## పరిణయ ప్రసంగము

**విశాఖపట్టణ** రాజ వీధిలో నారాయణరావనియెడు బ్రాహ్మణుడు నివసించుచుండెను అతడు న్యాయవాద వృత్తి నవలంబించి ధర్మోపేతముగా జీవయాత్ర గడుపుచుండెను అతనికి లేక లేక కృష్ణారావను నొక కుమారుడు పుట్టెను ఆ కృష్ణారావు స్కూలు ఫైనలు క్లాసు చదువుచుండెను అతని తండ్రి యతనికతి శీఘ్రముగా వివాహము జరిపింపవలయునని యోజింపసాగెను ఇదివఱలో జాలమంది తమ కూతుల నొసంగెదమనుచు వచ్చిరి గాని కృష్ణారావు తిరస్కరించు చుండెను ఆ కన్యక లెంతటి రూపవంతులైనను, అతనికి మనస్కరించుట లేదు రూపముతోబాటు విద్య కూడ నుండవలయునని యతని తలంపు కాని యట్టి వారెవ్వరును సిద్ధించుట లేదు నారాయణరావు విశ్వ ప్రయత్నము లొనరించుచున్నను గుమారుని యభీష్టము దీర్పజాలడాయెను. లోకమున సామాన్యముగా దమ కూతులకే యెవ్వరైన వరునన్వేషింతురుగాని మన నారాయణరావు కుమారునికే వధువు నన్వేషింపవలసి వచ్చెను.

ఒకనాటి యుదయమున నారాయణరావింటి యరుగుపై గూర్చుండి దంతధావన మొనరించుకొనుచుండెను అట్టి సమయమున నచ్చోటికొక పురుషుడేతెంచి వినయపురస్సరముగా 'బావగారూ నమస్కార'మని పలుకుచు గుమ్మమెక్కెను - నారాయణావతని వంకనే తదేక ధ్యానపరాయణుడై వీక్షించుచు 'ఇతడెవ్వడై యుండునా'యని యోచింపసాగెను అంతట నప్పురుషుడు తన పేరు రాఘవయ్యయనియు, దానాతని దూరపు బంధువుడననియు, వరుసకు బావనగుదుననియు దన్నెరిగించుకొని తన నివాస స్థలము చీపురుపల్లియని వచించెను కాని యప్పటికిని నారాయణరావతనిని బోల్పజాలడాయెను. పాపమా రాఘవయ్య తన్నెఱిగించుట కెంతయో ప్రయాసమొందెనుగాని సుంతేనియు లాభము లేదయ్యెను తుదకెట్లో నారాయణరావితడు 'మా బావ కావచ్చు'నని యెంచి తగు మర్యాద లొనరించి లోనికి దీసికొనిపోయెను

తదనంతరము రాఘవయ్య నారాయణరావుతో 'బావా! నీవు కృష్ణారావునకు వివాహ మొనరింపదల పెట్టితివనియు, అందులకు వానికి మనసుకెక్కిన కాంత లభింపకపోవుటచే నిప్పటివఱకు బెండ్లి జరుగలేదనియు విన్నాను. కాని యింక నా భయమొందనవసరము లేదు నా సుత బంగారమ్మయున్నది ఆమె విద్యా ప్రౌఢిమ వర్ణనీయము నా కూతురని నేను పొగడుకొనరాదుగాన మీరే యామె విద్యాబుద్ధులెఱుంగగలరు మఱి సౌందర్యము గూర్చి నేను వేఱుగా జెప్పనక్కఱ లేదు. ఈ చిత్రపటము జూచినచో మీకే బోధపడును. ఈ పటమును గనులార

చూచి, యామె విద్యా ప్రౌఢిమ గూర్చి విన్నచో కృష్ణారావీ సంబంధమును తిరస్కరింపడు కావున దీనిని జూపి వాని నొప్పింపు'మని పలికి ఛాయాపటమిచ్చి మరల 'బావా! నాదొక విన్నపము గలదు నాకీమె యొక్కతియే కూతురు దానికి జిన్నప్పుడొక జాడ్యమువచ్చి ప్రాణము మీదికి రాగా నపుడామె బ్రదికినచొ తద్వివాహము సింహాచలమున దేవుని సన్నిధానమున జేయమ్రొక్కుకొంటిమి కావున ఈ వివాహమచ్చట జరుగవలె'నని వేడుకొనియెను అందులకు నారాయణరావేమొ అడ్డంకులు చెప్పినను తుదకు రాఘవయ్య దీనాలాపములచే సమ్మతించి యా చిత్రపటమును బుచ్చుకొని 'బావా! దీనిని జూపి నా సర్వశక్తులు వినియోగించి కృష్ణారావును వివాహోన్ముఖు నొనరించెదను వాడు సమ్మతించినచో ఈ వివాహము కొండమీద జరుపవచ్చు' ననియెను అది విని రాఘవయ్య యమందానందమందెను

రెండవ ప్రకరణము

## పరిణయ నిశ్చయము

**ఆనాటి** సాయం సమయమున వాడుక చొప్పున గృష్ణారావు సముద్రపు టొడ్డునకు జని యటనుండి మిత్రసమేతుడై వచ్చెను అంత నారాయణరావతని యొద్దకు వచ్చి బంగారమ్మ రూప పటమును జూపుచు 'నాయనా! ఈమెయే నీవు పెండ్లాడవలసిన కాంత ఇది మన రాఘవయ్య గారి కూతురు మొదటి ఫారము వరకు జదువుకొన్నది ఎట్టి గ్రంధమునైన జదివి యవలీల నర్ధము చేసికొనగలది ఇంతటి బుద్ధిమంతురాలు, విద్యావంతురాలు, నీకు మఱియొకతె దొరకబోదు కావున ఆలోచించుకొనుము నీవును బుద్ధిమంతుడవే! కనుక నీకిది వఱకెన్ని సంబంధములు వచ్చి యెట్లు తప్పిపోయినవో రవంత జ్ఞప్తికి దెచ్చుకొనము దీనిని గూడనట్లే తిరస్కరింతువేని ఇక నీకింతటి మంచి సంబంధము దొరకబోదని ఘంటాపథముగా జెప్పుచున్నాను కావున ఆలోచించుకొను'మని నొక్కి వక్కాణించెను

'తండ్రీ! ఆలోచనకేమున్నది? కాని ఆ రాఘవయ్య యెవ్వరు? క్రొత్తపేరు విన్నానే!' అని కృష్ణారావనెను

'క్రొత్తవారు కారు అతడు మీ మామ నా బావ. మన బంధువుడు చీవురుపల్లి వాస్తవ్యుడు మొదట నీవలెనే నేనును అతడెవ్వడో తెలిసికొనజాలకపోతినిగాని తుదకు నా సందేహము విచ్ఛిన్నమయ్యెను కాని దానికేమిలే! వారి పిల్ల బంగారమ్మను పెండ్లాడుదువా?'యని నారాయణరావు ప్రశ్నించెను

ఎప్పుడు కృష్ణారావు బంగారమ్మ ఛాయాపటమును చూచెనొ, అప్పుడే ఆమె రూపమునకు ముగ్ధుడగుటచేతను, ఆమె యసమాన విద్యావంతురాలని తండ్రివలన వినుటచేతను, అతడు తన యదృష్టమును గొనియాడుకొనుచు, వివాహమునకు సమ్మతించెను

అంతలో నటకు రాఘవయ్య వచ్చెను కృష్ణారావు పెండ్లికి సమ్మతించెనని వినగానే అతడు పొందిన సంతోషమునకు మేఱలేదయ్యెను అతడొక శుభముహూర్తము బెట్టించి నారాయణరావుతో 'బావా! లక్ష్మివారమునాటి యుదయ యెనిమిది గంటలకు లగ్నము నిశ్చితమైనది బుధవారమునాడు మీరు కొండకు రండు ఆ రాత్రికే నేను కుటుంబముతో వచ్చెద'ననియెను అందులకు నారాయణరావు సమ్మతించెను రాఘవయ్య యంతట నచ్చోటు బాసిపోయెను

మూడవ ప్రకరణము

# పరిణయ భంగము

**లేకలేక** కలిగిన యేక పుత్రుని వివాహ మత్యంత వైభవ సముపేతముగా జరిగించవలయునని యెంచి నారాయణరావు వివిదములగు నూతన వస్తు సముదాయములను దెప్పించుచుండెను మఱియు నాతడు పెండ్లికూతసకై ఇరువది తులముల బంగారమును కొని, కొన్ని నగలు మిక్కిలి సుందరముగా జేయించి, వానిని పెండ్లి ఖర్చులకు రావలసిన మూడు వేల రూకలతో గలిపి యొక పెట్టెలో బెట్టి భద్రపరచెను

అంతలో బుధవారము వచ్చెను నారాయణరావారాటము హెచ్చెను కృష్ణారావు సంతోషింపజొచ్చెను ఆనాటికి బెండ్లి సన్నాహములెట్లో బూర్తియయ్యెను విశాఖపట్టణము నుండి బండ్లు బయలుదేరి మధ్యాహ్నమగుసరికి సింహాచలము జేరుకొనియెను పెండ్లివారెల్లరును పుట్టెడాకటితో నూరుజేరుకొని యదివఱకే పూర్తియైన వంటకములను గుత్తుకబంటి వఱకు మెక్కిరి అందుఱును రాత్రియే రాఘవయ్య కుంటుబ సమేతుడై వచ్చునని యతనికై యెదురుచూచుచుండిరి కాని ఎవ్వరును వచ్చుటలేదు క్రమక్రమముగా నెనిమిది తొమ్మిది గంటలయ్యెను అంతట వాకిట నొక బండి వచ్చి నిల్చెను అందులకు రాఘవయ్యయు, దద్భార్యయు, అసమాన రూపలావణ్యవతియగు బంగారమ్మయు దిగిరి ఆ బంగారమ్మ యప్పుడు యధోచిత వేషమున నుండెను ఆమె సౌందర్యమును జూచిన వారంద 'అది కృష్ణారావునకు దగిన భార్య'యని మెచ్చుకొనుచు వారిని లోన బ్రవేశింపజేసిరి

కొండక వడికి రాఘవయ్య నారాయణరావు నొద్దకు వచ్చి 'బావా! పెండ్లి కూతునకు జేయించిన నగలెట్టివో నా భార్యాదులు జూడ వేడుకపడుచున్నారు వాని నొకమాఱు జూపింపు'డనెను నారాయణరావట్లేయని నగలు, ధనమును దాచిన పెట్టె దీసికొని వచ్చెను అందఱును ఆ నగలు జూచి 'మిక్కిలి బాగున్న'వనిరి తదనంతరము నారాయణరావా పేటికను యధాస్థానమున నుంచి వచ్చెను పిమ్మట 'తెల్లవారుజాముననే లేవవలె'నను తలంపుతోడ నందఱును శయ్యాగతులైరి రాఘవయ్య మాత్రము లఘ్నము తెల్లవారగానే కానున్నది కావున అందులకు దగు సన్నాహములు జేయించుచు, మిక్కిలి తొందఱగా రెండు విడిదెలలోను దిరుగుచు, నెక్కడ జూచినను దానెయై చూపట్టుచుండెను.

తెల్లవారెను ముహూర్తకాల మేగుదెంచెను మంగళస్నానములు జేయింపవలెనని పురోహితులు మిక్కిలి తొందఱపెట్టసాగిరి కృష్ణారావలవాటు చొప్పున వేగము మేల్కాంచెను బంగారమ్మను లేపుట కొఱకై కొందఱాడు పెండ్లివారి విడిదిని జనిరి కాని యచ్చట నెవ్వరును గానరారైరి 'ఆడు పెండ్లివారెటకేగియుందు'రని వారచ్చట బండుకొన్న వారి నడుగగా 'అదేమో మాకు దెలియదు. నిన్న రాత్రి యచ్చట బంగారమ్మ తల్లితో గూడ బండుకొనుటయు, అప్పుడప్పుడు రాఘవయ్య వచ్చి వారితోనేమో సంభాషించుచుండుటయు, మేమెఱుగుదుము పిమ్మట మేము నిద్రాగతులమైతిమి అనంతర వృత్తాంతమేమియు మాకు దెలియద'ని వారు పల్కిరి ఇదంతయు విని యటకు వచ్చినవారు మరలిపోయి యీ వృత్తాంతము తెలియజేసిరి ముహూర్తకాల మతిక్రమించి పోయెను

నారాయణరావిట్లాకస్మికముగా బరిణయ భంగమగుటచే మిక్కిలి విచారించెను పెండ్లి భంగమగుటయేగాక కొంత ధనము కూడ నిష్కారణముగా ఖర్చుల నిమిత్తము వెచ్చయైనదనియు, అట్లయ్యును ముద్దుముచ్చటలు దీరుటలేదనియు నారాయణరావు మిక్కిలి విచారించెను.

అంతలో గొందఱు బండ్లవాండ్రు తొందఱగా అద్దెలకొఱకై వచ్చిరి నారాయణరావు ధనపేటికను తెమ్మని యొకని కాజ్ఞాపించెను. వాడద్దాని నుంచిన స్థలమునకు జని మరల సర్రభస గమనముతో వచ్చి 'అయ్యో! అయ్యో! ధనపేటిక యదాస్థానమున లేదు నాకీ చిత్రమేమో తెలియకున్నది' అని నెత్తియు నోరును గొట్టుకొనుచు నరచెను

పరిణయ భంగమగుటయేగాక ధన పేటిక గూడ బోయినదని వినిన తోడనే నారాయణరావు దుఃఖము గట్టుతెగిన యేటివలె పొంగిపొరలి ప్రవహింపసాగెను అతని కప్పుడు రాఘవయ్య దుర్ణయమంతయు బోధపడియెను. ఈ ధనాపహర్త రాఘవయ్యయేయని తెలిసికొని విచారింపసాగెను "నగలు జూడ వేడుక పడుచున్నారని పల్కి నగలు పెట్టిన పెట్టెయు, పెట్టె నుంచిన స్థానమును గుర్తెఱిగినాడు ఆ రాత్రియే నగల పెట్టె హరించి భార్యా పుత్రికలతో పలాయనమైనాడు అయ్యో! నేనిప్పుడు చేయునదేమి! లోకమున నింతటి మాయావులుందురని యెఱుగనై తిని ఇట్లమాయకులను మోసపుచ్చి ధనము హరించు వారుందురని యనుకొననైతిని అయ్యయ్యో! దైవమా! ఎంతటి విపత్తు దెచ్చి పెట్టితివి! నేనీ విషయమై ఎవ్వరితో మొఱయిడుకొందును! ఎవ్వరునా యార్తి దీర్చువారు? ఎవ్వరు నా ధనము నాకిప్పించువారు? అయ్యో! ధనము దొరకకున్న మానె! పెండ్లిభంగమైనమానె! ఆ రాఘవయ్య దొరికినచో అదే పదివేలు వాడే దొరికనచో ధనము దొరుకును బంగారము దొరుకును నాకుమారుని పునర్వివాహము తప్పును. కాని నాకంతటి యదృష్టము పట్టునా? అట్లు దేవుడను గ్రహించునా? ఆ రాఘవయ్యను బట్టి శిక్షించు మహానుభావులెందేని లేరా? మా కుటుంబము నుద్ధరించు దయాళువులు లేరా? అక్కటా! దైవమా! ఏమిదారి!" యని మిక్కిలి దుఃఖింపసాగెను

అంతట బంధు జనులతని నోదార్చుచు 'బాబూ! విచారింపకుము అచిరకాలములోనే రాఘవయ్యకు ప్రాయశ్చితము కాగలదు మన రామమోహనరావీ పనికి బూనుకొన్నచో నిముషములపై వానిని మన పాదముల చెంతకు ధనముతో గూడ జేర్పగలడు ఆ రామమోహనరావు మన జిల్లాకంతకును బ్రసిద్ధికెక్కిన యపరాధ పరిశోధకుడు. అతడు దయార్ద్ర హృదయుడు కావున మన ప్రార్థనములను ద్రోసిపుచ్చడు. కనుక నిక భోజనమునకులెమ్ము. మన విశాఖ పట్టణమునకు బోయి దగు కట్టు దిట్టములు చేయుద'మనుచు వచించిరి

నారాయణరావు కొంతవరకు దుఃఖించి బంధువుల వాక్యముల వలన గొంచెమూరడిల్లి బంధుమిత్ర పరివారముతో విశాఖ పట్టణము జేరెను

### నాలుగవ ప్రకరణము

## రాజమహేంద్రవర ప్రయాణము

ఆ మఱునాటి మధ్యాహ్నాము సూర్యుడు చండతర తేజస్సంపన్నుడై గగనమున నర్ధభాగమునకు బైగా ప్రయాణము సాగించెను. నారాయణరావు దైన్యముతో నెట్లో పురము జేరుకొని డిటెక్టివ్ రామమోహనరావింటికి జని తన దుఃఖచరిత్రమంతయు బూసగుచ్చినట్లు దెలియజేసి 'నాయనా

ామమోహనరాయా నీవనేక విషయములగు కేసులలో బనిజేసినావు అనేకులగు దుర్మార్గులను బట్టి దండింపించినావు చోరులకు హంతకులకు తదితరులగు మోసగాండ్రకు నీ పేరన్న సింహస్వప్నముగా వర్తించుచున్నావు. అనేకుల ధన, మాన ప్రాణములను గాపాడినావు అట్టి నీవీ రాఘవయ్యనుగూడ బట్టుకొని శిక్ష జేయించి నా ధనము నాకిప్పించి యపారమగు కీర్తి జేకొను' మని పల్కుచు పరిపరి రీతుల వేడుకొనియెను రామమోహనరావు నస్మితవదనుడై 'నారాయణరావుగారూ! మీరు నన్నింతగా వేడుకొనవలసిన యగత్యము లేదు. అది నా ధర్మము నేను త్రికరణ శుద్ధిగా నేడే యీ పరిణయ రహస్య పరిశోధనమునకు బూనుకొనుచున్నాను' అని పలికెను

అంతలో రామమోహనరావు కొక శుభలేక రాజమహేంద్రవరము నుండి వచ్చెను అందతని బావయొక్క పుత్రికా వివాహమును గూర్చి వ్రాయబడియుండెను రామమోహనరావు దానింజూచి 'అయ్యా! నే నికిప్పుడు రాజమహేంద్రవరమునకు బోవలయును రేపే లగ్నము కావున నేనట నుండి రాగానే పరిశోధనకారంభింపగల''నని పలికెను. యది విని నారాయణరావేదో జ్ఞాపకము దెచ్చుకొని 'అన్నట్టు రేపు శనివారము కదా! నాకు రాజమహేంద్రవరమున నొక కేసున్నది. అది రేపటికి వాయిదా పడినది కావున నేను కూడా నటకు వచ్చెదను నివెప్పుడు పోయెదవు' అనెను.

రామ నే నీ రాత్రియే వెళ్లుచున్నాను మీకు తీరునా?

నారా . అన్నా! నీతో గలిసి వచ్చుటకు వీలులేదు. నేటి రాత్రి కాగితములన్నియు తీసికొని ఉదయము వచ్చెదను రేపటి మధ్యాహ్నమే కేసు ఇప్పుడు నీవు వెళ్ళుము.

రామమోహనరావారాత్రియే రాజమహేంద్రవరమునకు జనియెను నారాయణరావింటికి వచ్చి తన వ్రాత బల్ల మీది కాగితములను సరిజేసికొనుచు మఱునాటికి కావలసిన కాగితముల నొక చోట బెట్టుచుండెను అట్లుకాగితములను దిరుగ వేయుచున్న సమయమున రాఘవయ్య యొసగిన బంగారమ్మ ఛాయా పటమగపడెను. అతడు గతుక్కుమని 'అయ్యో! అ పటము గూర్చి రామమోహనరావునకు జెప్పనైతిని దీనిని మూల సూత్రముగజేకొని యతడే వృత్తాంతయైనను బైకిదీసి యుండునేమో. కానిమ్ము ఇప్పటికిని మించి పోయినది లేదు ఆ యూర గలిసి కొందుము కదా అప్పుడు చెప్పవచ్చు'ననుకొనుచు మఱునాడే రాజమహేంద్ర వరమునకు బయనమయ్యెను.

### ఐదవ ప్రకరణము

## ఆలోచనము

**ఒకనాట** యుదయమున గోదావరి నది మీది వంతనపై నిద్దఱు పురుషులు నడుచుచు నిట్లు మాట్లాడుకొనుచుండిరి.

మొదటివాడు ఓయీ! నేడు శనివారము. మన మీ రాజమహేంద్రవరమున కేతెంచి యప్పుడే రెండు రోజులు గడచెను. కాని కర్తవ్యవేమియు నిశ్చితముకాదయ్యె. ఆలోచింప నే జెప్పినదే యుచితమని తోచుచున్నది

రెండవ వాడు · ఓయీ! నీవు చెప్పినది సరికాదు. రాజారావు మన పాలిటి కల్పవృక్షము అట్టి వానిని స్వల్ప ధనమున కాసించి యిచ్చి వేయుట మంచిదా?

మొదటి ఇప్పట్ల మంచిదే! ఏలయన మనము వానిని మనతొ ద్రిప్పుకొనుచున్నచొ బట్టువడుట నిశ్చయము అందులకు గారణమిది! మన మాతని ఫొటోగ్రాపును నారాయణునికిచ్చితిమి కదా! దానినాతడు తప్పక పోలీసు వారికి చూపక మానడు అద్దానిని మూల సూత్రముగా జేసికొని వారు మనల నన్వేషింతురు అట్టిచో వీడు మనతో నున్నచో మనము తప్పక దొరికిపోమా! ఇది యాలోచించియే నా యెత్తు నెత్తితిని ధనముకన్న ప్రాణము తీపి కాదా! అదియుగాక నా యెత్తు వలన కొంత ధనము కూడా మనకు దొరకవచ్చును

రెండవ మిత్రమా! నీ బుద్ధియప్రేయము నీ యుద్దేశ మెఱుగజాలక నేనీ రెండు రోజులు నీవు చెప్పినట్లు చేయనైతిని ఇకపై నీవేమి చెప్పినను చేయుటకు సంసిద్ధుడనై యున్నాను

మొదటి అట్లయిన నీవిప్పుడే పోయి రాజారావు తండ్రి యొద్ద ధనము తేవలెను కొడుకు దొరికినచో వాడధికానందభరితుడై మనము కోరిన ధనమిచ్చును అదియుగాక నేటి నుండి వానియొద్ద ధనమధిక ముండును కావున నీవు రాజారావు నతనికిచ్చి ఎట్లయిన వేయి రూపాయలకు దక్కువగాకుండా ధనము తెమ్ము నేనిప్పు డాభరణములతో నరసీపట్టణమున కేగెదను అట మన ఆనందరావింట నుందును నీవు కార్యము సఫలము చేసికొని ధనముతో నటకురామ్ము జాగ్రత్త! కార్యము చెడగొట్టకుమా?

రెండవ ఈ స్వల్ప కార్యము నెరవేర్పనివాడు పశుప్రాయుడే!

వారట్లు మాట్లాడుకొని వెడలిపోయిరి

### ఆఱవ ప్రకరణము

## కామేశ్వరరావు

**రాజమహేంద్రవరమున** కామేశ్వరరావను ధనిక బ్రాహ్మణుడు నివసించుచుండెను ఇతడు ధనికుడేగాక ధార్మికుడు ఇతనికి కాంతమ్మయను పుత్రికయు పద్మనాభరావను పుత్రుడును గలరు ఇతడత్యంత సంతోషముతో గాలము బుచ్చుచు లోకమున దనకంటె సంతోషి వేఱొకడుండబోడని యనుకొనుచుండెను కాని దైవము మాత్రమితని సంతోషమును జూడజాలక దద్భార్య నిహలోకము నుండి తొలగించివైచెను అందుచేత కామేశ్వరరావొక వంటల వానిని బెట్టుకొనియెను ఆ వంటలవాడు మొట్టమొదట మిక్కిలి నమ్మకముగా బనిచేసినను కాలక్రమమున వాని బుద్ధి వక్రమైనందున వాడు కామేశ్వరుని ప్రేమైక నిధానమగు పద్మనాభరావు నెట్లో యపహరించుకొనిపోయెను అందువలన పాపము కామేశ్వరరావు యొక్క పుట్టెడు సంతోషము కొండంత దుఃఖముగా మారెను అతడు మిక్కిలి విచారించి పుత్రాన్వేషణమునకై యనేకులను బంపెనుగాని తత్ప్రయత్నములెల్ల వృథయయ్యెను ఇట్లు రెండేండ్లు గడచెను

కామేశ్వరరావంతతో బుత్రునిపై నిరాశజేసికొని ఇదివఱలో దీయించిన యతని రూప పటము జూచుకొని సంతుష్టినొందుచు కాంతమ్మనే పుత్రునిగా జూచుకొని యామెపై మిక్కిలి యభిమానము వహించియుండెను

ఇట్లుండ గాంతమ్మకు వివాహ వయస్సు వచ్చెను కామేశ్వరరావమె ఏవాహము మహా వైభవముగా జేయుటకు సర్వసన్నాహములుజేసి పెండ్లికి తమ బంధువలనందఱి నాహ్వానించెను అట్లాహ్వానింపబడిన వారలలో విశాఖపట్టణమున వినుతికెక్కిన డిటెక్టివు రామమోహనరావొకడు అతడు శుక్రవారమునాటి రాత్రి నారాయణరావుని వీడ్కొని రాజమహేంద్రవరమునకు వచ్చిన సంగతి మనకు విశదమే అతడు రాగానే కామేశ్వరరావతని సత్కరించి మర్యాదచేసెను

మఱునాటి ప్రాతఃకాలమున రామమోహనరావు మేల్కొని నాడే విశాఖపట్టణము నుండి యటకు రానున్న నారాయణరావును తీసికొని వచ్చుటకై రైలు స్టేషనునకు జనియెను అతడు వెళ్లిన కొన్ని నిమిషములకు కామేశ్వరరావు నొద్దకొక పురుషుడు వచ్చెను అతనిని జూచి కామేశ్వరరావు 'నీవెవ్వడ'వని ప్రశ్నించెను

ఆ పురుషడు 'అయ్యా! నేనొక బీదవాడను కఱ్ఱలు కొట్టుకొని జీవించుటయే నా వృత్తి ఒకనాడు మనయూరి పరిసరారణ్యములో కఱ్ఱలు కట్టుకొనుచుండగా నొక పిల్లవాడొక చెట్టునకు గట్టివేయబడి నాకు కన్పించెను 'నీ వృత్తాంతమే'మని యడుగగా వాడు తన పురు పద్మనాభరావనియు దాను మీ కుమారుడననియు జెప్పెను అతడిన్నాళ్లును ఒక చోర బృందము మధ్యనున్నాడట వారిప్పుడు విడిపోయియతని నిట్లడవిలో కట్టివేసి యుంచిరట వానిని మీకిప్పుడొసగి నా దారిద్ర్యమును బావుకొనవచ్చితిని మీరు నాకు వేయి రూపాయలిచ్చినచో నిదే వెళ్ళి వానిని దీసికొని వత్తును' అనియెను

అది విని కామేశ్వరరావు పొందిన సంతసమునకు మేరలేకపోయెను పుత్రసందర్శన కుతూహలపరుడైన యతడు మఱేమియు నప్పురుషుని బ్రశ్నింపక 'ఓయీ! నీవు కోరినదిచ్చెద వానిని దెమ్ము' అని పలికెను ఆ పురుషుడు మహానందముతో వెడలిపోయెను

## ఏడవ ప్రకరణము

# రహస్య ప్రకాశనము

**రామమోహనరావట్లు** నారాయణరావును తీసికొనివచ్చుటకు రైలు స్టేషనుకు బోగానే ధూమశకటము వచ్చియుండెను అచ్చట నతడటునిటు చూచుచుండగా నారాయణరావతని యెద్దకు వచ్చి జేబులో నుండి యొక ఛాయాపటమును దీసి 'రామమోహనా! ఇది రాఘవయ్య నాకిచ్చిన బంగారమ్మ ఛాయాపటము ఇది నీకు బరిశోధనకుపకరించునేమోయని తెచ్చితిని' అని దాని నిచ్చెను రామమోహనరావద్దాని వంక నిశ్చలబుద్ధితో జూచుచు 'అన్నా! నారాయణరావుగారూ! ఈ రాఘవయ్య యసామాన్యుడుగా నగపడుచున్నాడే! వీడు చేయుచున్న పని యిదియా! ఈ విధముగా వీనికి మా పద్మనాభరావుపకరించుచున్నాడా?' అని యొక నిట్టూర్పు పుచ్చెను

నారాయణరావంతట 'వోయీ! ఇదేమి! మీ పద్మనాభరావెవ్వ'రని యడిగెను. రామమోహనరావు కామేశ్వరరావు వృత్తాంతము జెప్పి 'అయ్యా ఆ పద్మనాభరావు, ఈ బంగారమ్మ పటము ఒక్క తీరున నున్నవి దీనిని బట్టి చూడగా ఆ రాఘవయ్యయే పద్మనాభరావును హరించిన వంటలవాడని తెలియుచున్నది ఆ రాఘవయ్య చేయుచున్న ఘోరములిప్పుడు తెలియినగును వీడా పద్మనాభుని హరించి, వాని కాడువేషము వేయించి మీ వంటి యమాయకుల వద్ద ధనము లాగుచున్నాడు ఇట్టివానిని బట్టి గట్టి శిక్ష జేయింపకున్నచో వీని దురాచారములు ప్రబలిపోవును' అని పలికెను. తదనంతరము నారాయణరావొక బండి మాట్లాడి రామమోహనరావుతో బాటందెక్కి కామేశ్వరరావింటికి జనెను వీరి నల్లంత దూరమున జూడగనే కామేశ్వరరావు తొందఱగా బరుగెత్తుకొని వచ్చి 'బావా రామమోహనా! మన పద్మనాభరావు దొరకును వేయి రూపాయలు పోయిననేమి? మనవాడు దొరకుచున్నాడు!' అని పలికి యిదివరలో వచ్చిన పురుషుని వృత్తాంతము దెల్పెను. రామమోహనరావు కూడ సంతసించి యేదో ఆలోచించుచుండెను. నారాయణరావచ్చటనున్న యొక ఫోటోగ్రాపును చూచి యచ్చెరువుతో 'నిదెవ్వరిది!' అని యచ్చటివారినడిగెను. అంతట వారది పద్మనాబరావు ఛాయాపటమనిరి నారాయణారావంతనద్దానితో బంగారమ్మ పటముబోల్చి చూడ భేదమేమియు గనపట్టలేదు అప్పుడందఱికిని రాఘవయ్యయే పూర్వపు వంటల వాడని విశ్వాసముదయించెను కామేశ్వరారావీ యద్భుత సంఘటనమున కద్భుతపడి 'ఏమయిననేమి! మా పద్మనాభము మాకు దొరకును అదే పదివేల'నెను నారాయణరావంతట 'అయ్యా! మీకు పుత్రలాభము కల్గుటేగాక మాక నష్ట ధనలాభము కలుగునేమో! మీ పుత్రుడు బంగారమ్మ వేషము వేసినవాడని స్పష్టమైనది మఱియు మీ వంటలవాడు రాఘవయ్యయని తెలిసినది ఇప్పుడు మీ పుత్రుడు దొరకనున్నాడు. కావున మా ధనము కూడ దొరకరాదా!' అనెను. 'ఎట్ల'ని కామేశ్వరుడడిగెను. 'పద్మనాభరావును మీ కప్పగింతునన్న కట్టెలవాడే కావలసిన దొంగ' అని నారాయణరావు చెప్పెను

అంత రామమోహనరావమందానందభరితుడై 'రహస్యము బేదింపబడినట్లే! కామేశ్వరా! నారాయణరావుగారు చెప్పినట్లు కఱ్ఱలు కొట్టుకొనువాడు రాఘవయ్యయో, తదనుచరుడో కావచ్చును. వాడు నీతో చెప్పిన వాక్యములు కల్ల! ఇప్పుడు వానిని బంధించినచో రహస్యములు బయలుపడును వాడిటకు వచ్చును కదా! రాగానే మాకు సంజ్ఞ చేయుము. మేము వచ్చి వానిని బంధింతు'మని పలికి నారాయణరావుతో బాటొక గదిలో దాగియుండెను

అంతలో నచ్చోటికి వెనుకటి పురుషుడు పద్మనాభరావుతో గూడ వచ్చెను కామేశ్వరరావు సంతసించి వానితో నేదో మాట్లాడుచు సాంకేతికముగా నొక యీల వైచెను. అంతలో బ్రక్క గది తలుపు తీసికొని రామమెహనరావు నారాయణరావు వెంటరాగా వ్యాఘ్రమువలె నా కఱ్ఱలవానిపై లంఘించి యతనిని శృంఖలాబద్ధు నొనరించెను.

అంతట నప్పురుషుడు గడగడ వడకుచు 'ఇదేమి! నాకీ గతియేమి! నేనేమి తప్పుజేసితిని' అనెను. కాని యతని నోటి నుండి యా వాక్కులు స్పష్టముగా రాలేదు అతడచ్చటివారిలో నెవరికో భయపడుచున్నంట్లుండెను

అంత నారాయణరావతనిని బోల్చి 'ఓరి! దుర్మార్గుడా! నీవేతప్పును చేయలేదా! నాడు రాఘవయ్య భార్యవలె వేషము దాల్చి మా కన్నులలో గారము జల్లినది నీవే కాదా! పాపాత్మా! నీవు

నిరపరాధివా? అని గద్దించెను రామమోహనరావు కూడ వానిని మఱింత భయపెట్టుచు 'నీవు యదార్థవృత్తాంతము తెలియచేయనిచో బ్రదుకవు' అనెను వాడికి విధిలేక తన వృత్తాంతమంతయు నిట్లుజెప్పెను

'అయ్యా! ఆ రాఘవయ్య మిక్కిలి మాయావి! వాడు నన్ను ధనాశ జూపి లోబరచుకొనెను నేను పేరాశకు లోనయి వాడు చేయుమన్న తుచ్ఛపు బనులెల్ల జేయజొచ్చితిని అట్లే వాడానాడు నాకును, రాజారావుకును - అనగా యీ పద్మనాభరావుకును స్త్రీ వేషములను వేయించి సింహాచలమున మిమ్ము మోసపుచ్చెను ఆ రాత్రియే వాడొక పెట్టె హరించి మాగూడ నిటకు పారివచ్చెను పిమ్మట వాడీ రాజారావున్నచో ముప్పు తటస్థించునని జెప్పి నాతో వీనిని కామేశ్వరరావునకప్పగింపుమని యాజ్ఞాపించెను కాని యందులకు నేనిష్టపడలేదు నేటి యుదయమున గోదావరి నది వంతెనపై నాకంతయు బోధించి నన్నిష్టపరచి తాను నరసీపట్టణమునకు జనెను నేను కూడ నేడే వెళ్లిపోయి యందునుగాని నా దురదృష్టముచే నిట్లయితిని. నిజముగా నేను పశుప్రాయుడను అయ్యా ఆ రాఘవయ్య యిప్పుడానందరావింట నుండును' అని చెప్పెను రామమోహనరావు సంతసించి యా పురుషుని పోలీసు వారిచే విశాఖ పట్టణమునకు బంపివేసి కామేశ్వరరావుతో 'అయ్యా! నన్ను గూర్చి యెవ్వరైన అడిగినచో విశాఖపట్టణమునకు బోతినని చెప్పు'డని పల్కుచు ఆనందరావు నన్వేషించుటకై నారాయణరావుతో నరసీపట్టణమునకు జనెను

ఎనిమిదవ ప్రకరణము

## సంభాషణము

**నాడు** రాఘవయ్య తన యనుచరుని యొద్ద నుండి వీడ్కొని నరసీపట్టణమునకు జని తన మిత్రుడగు నానందరావు గృహమున జేరి తన పెట్టె నొకచోబెట్టి మార్గాయాసముచే నొక మూల విశ్రమించెను. ఆనందరావు పెట్టెను జూచి యది మిక్కిలి బరువుగా నుండుటచే 'ఇందేమి గల' దని ప్రశ్నించెను

రాఘ  దీని సంగతి చాల పెద్దది గలదు. దీనిని నీ వశముననే యుంచవలెను.

ఆనం  ఎచ్చట నుండి వచ్చుచున్నావు?

రాఘ  రాజమహేంద్రవరము నుండి నేడో రేపో మన దత్తు కూడా వచ్చును. వానినొక పనికి నియోగించితిని

ఆనం . ఏ పని ?

రాఘ  'ధనము దెచ్చుట' అని యా వృత్తాంతము జెప్పగా రాజారావు నిచ్చివేయనున్నందుల కానందరావు మొదట విచారించినను, తత్కారణ మెఱిగి యూరడిల్లి 'ఈ పెట్టెలో కూడ ధనమే యున్నదా?' యని యడిగెను.

రాఘ  ధనమే గాక నగలు కూడ గలవు.

ఆనం  చాలా బరువుగా నున్నదే! ఇంత ధనము, నగలు ఎటు సంపాదించితివి?

రాఘ  (నారాయణరావును మోసపుచ్చిన విధము తెలియజేసెను)

ఆనం (మహానందముతొ) రాఘవా! నీ బుద్ధి యప్రమేయము మన దత్తు కూడ కామేశ్వరరావును బుట్టలో బెట్టి ధనము తెచ్చినచో బాగుండును

రాఘ మిత్రమా! అదేమియు గష్టము కాదు చేయవలసిన పనియంతయు బోధించియే వచ్చితిని అతడు ధనముతో వచ్చి తీరును

అనంతరము వారు దత్తు రాక్కై వేచి యుండిరి కాని యతడు సకాలమునకు రాడయ్యెను రాఘవయ్య యద్భుతపడి యతని వృత్తాంతమేమై యుండునో తెలిసికొనదలంచి రాజమహేంద్రవరమునకు బయనమయ్యెను ఆనందరావతని రాక్కై యెదురుచూచుచుండెను అంతలో నతనికి లేఖ యొకటి వచ్చెను అందు జెప్పబడినట్లు రాఘవయ్య నాటికి మూడవనాడే వచ్చునని యెంచి యతనికై ఆనందరావు వేచియుండెను

### తొమ్మిదవ ప్రకరణము

## స్వర్ణాభరణము

**రామమోహనరావు** నారాయణరావుతో గూడ నరసీపట్టణము జేరినప్పటి నుండియు నానందరావునకై ప్రయత్నించుచుండెను కాన యతడెంత యత్నించినను గూఢనాముడై వర్తించుచున్న యతనిని దెలిసికొన జాలడాయెను. ఇట్లొకటి రెండు రోజులు గడచెను

ఇట్లుండ నొకనాడు రామమోహరావు నారాయణరావుతో గూడ పురంబున ప్రచ్ఛన్నవేషదారియై తిరుగుచుండగా నొక పురుషుడొక స్వర్ణాభరణమును దెచ్చి యమ్మజూపుచుండెను అతని చుట్టును కొందఱు పురుషులు మూగి యా నగనొక్కక్కరే చూచుచుండిరి అచ్చటకు వచ్చిన వారందఱద్దాని సౌందర్యమును ప్రశంసించువారేగాని యొక్కడును దానిని కొనవచ్చిన వాడుగా జూపట్టలేదు రామమోహనరావంతయు బరికించుచుండెను నారాయణరావందఱవలెనే యా నగను జూచి, యా యాభరణ విక్రేతతో 'ఓయీ! ఈ నగ బాగున్నది! ఇంకను నీ యొద్ద నేమైన నగలున్నవా?' యన వాడు 'అయ్యా ఉన్నవిగాని యిటకు దేలేదు శ్రమయనక మా యింటికి వచ్చినచో వాని జూపెద'నని వారిని తన యింటికి దీసికొనిపోయి కొన్ని నగలు తెచ్చి చూపెను నారాయణరావా నగలు జూచి యప్రతిభుడై తన యాశ్చర్యమును బైకి దోపనీయక 'ఓరీ! చోరాధమా! ఇవి దొంగిలింపబడిన నగలు వీని నమ్ముచున్న నీవు దొంగవు కనుక విశాఖపట్టణములోని డిటెక్టివగు నీ రామమోహనరావు నిన్ను బంధించు'నని గద్దించెను రామమోహనరావు వెంటనే వానిని బంధించి 'యోరీ! దుర్మార్గుడా! నీవు తప్పక రాఘవయ్య యనుచరుడవగు నానందరావువే! ఆ రాఘవయ్య కొంత ధనము, ఈ నగలు హరించి నీకిచ్చినాడు వీనిని నీవమ్ముచున్నావు కావున నిన్ను బంధించితిని! ఇక నీ వెంత బొంకినను లాభము లేదు! నీయొద్ద నింకను కొంత ధనము, నగలు నుండవలెను అబద్ధమాడక వాని నెక్కడ దాచితివో చెప్పు' మని గద్దించి యడిగెను.

ఆనందరావేమియును మాట్లాడక సిగ్గుచే దలవంచుకొని నిలువబడియుండెను రామమోహనరావతని నెంతో తఱచి యడిగినను మాట్లాడలేదు అంత డిటెక్టివు విసిగి వాని యింటి

నన్వేషింపనేగి యెల్ల ప్రదేశములు వెదుకగా నొక పెట్టె యగపడెను దానిలో నేమున్నదో చూతమని తెఱచినప్పుడతని సంతసమునకు మేఱయేమున్నది! ఆ పెట్టెను నారాయణరావు నొద్దకు దీసికొనివచ్చి 'అయ్యా! ఈ నగలు, ధనము మీవో కావో చెప్పు'డని యడిగెను ఆ నగలు నారాయణరావువే! ధనము కూడ కెంచె మెచ్చు తక్కువలతో నంతయు నుండెను నారాయణరావు సంతసించెను రామమోహనరావన్నియు బైకి తీయగానే అతని కొక లేఖ గోచరించెను ఆనందరావు వెంటనే 'హా! ఎంత పని' యని నేల గూలబడి విచార హృదయుడై చూచుచుండెను రామమోహనరావా లేఖ నిట్లు చదివెను

'ప్రియ మిత్రమా!

మొన్న నీతో జెప్పినట్లు రాజమహేంద్రవరమునకు వచ్చి దత్తు కొఱకై ప్రయత్నించగా అతడు రామమోహనరావునకు బట్టువడెననియు నతనిని దీసికొని రామమోహనరావు విశాఖపట్టణమునకు బోయెనని దెలిసినది కావున నిక మనము తడవుజేసినచో ముప్పువచ్చును రామమోహనరావు విశాఖపట్టణము నుండి రాకమున్నే మనముదూర దేశములకు బారిపోవలయును కనుక నేను నేటికి మూడవనాటి కటకు వచ్చుచున్నాను! నీవు సాధ్యమైనచో నొకటి రెండు నగలమ్మివేసి ధనము చూకూర్చుము నేనటకు రాగానే ఇర్వురము పారిపోదము

ఇట్లు
నీ ప్రియమిత్రుడు
రాఘవయ్య

దీనిని చదువగానే రామమోహనరావు మహానందమున నారాయణరావుతో 'అయ్యా! ఈ లేఖ మొన్న వ్రాయబడినది! రేపు రాఘవయ్య యిటకు వచ్చితీరును అప్పుడు వానిని బంధించుదము' అని పలికెను అనంతర యతడానందరావును పోలీసు వారిచే విశాఖ పట్టణమునకు బంపివేసెను

## పదియవ ప్రకరణము

## నిరూపణము

**రాఘవయ్య** రాజమహేంద్రవరమున దనయనుచరుడు పట్టుపడెనని విని ఇక దనకానందరావొక్కడే యాప్తమిత్రుడని యెంచి యతనితో గలిసి పారిపోయి ప్రాణములు దక్కించుకొనదలచెను అట్టి యుద్దేశము తోడ నతడు నియమిత దినసంబునకు దూమశకటము నెక్కి తొమ్మిది గంటలగుసరికి నరసీపట్టణము రోడ్డులో దిగి మోటారు బస్ మీద నెక్కి పండ్రెండు గంటలగుసరి కూరుచేరెను మోటారాగి యతడీవలకు దిగగానే కొందఱు పోలీసు వారితో రామమోహనరావట ప్రత్యక్షమై 'ఓరీ! రాఘవయ్యా! ఇన్నాళ్లకు నీ పాపము పండినది ఇదివఱలో ననేకులను దుఃఖపెట్టినందులకు ఫలమిదే యనుభవింపు'మని పలుకుచు నతని హస్తములకు శృంఖలముల దగిలించెను

పిమ్మట రామమోహనరావు నారాయణరావు తోడను బంధితుడగు రాఘవయ్యతోడను భద్రముగా విశాఖపట్టణము జేరుకొని, యదివరకే అచ్చట ఖైదీలుగా నుంపబడిన దత్తు, ఆనందరావులతో రాఘవయ్యను జేర్చి నారాయణరావు కామేశ్వరరావులతో వారిపై వ్యాజ్యెము తెమ్మని యుపదేశించెను తదనంతర మానిరూపకుడు నారాయణరావు కామేశ్వరరావు లిచ్చిన సాక్ష్యముల మూలమునను, ఆనందుని యింట దొరికిన నగల పెట్టె, ఉత్తరముల మూలమునను వారల మీది నేరమును నిరూపించి, వారతలో రాఘవయ్యకు ద్వీపాంతరవాస శిక్షయు, ఆనందరావున కైదేండ్లు కఠిన కారాగార శిక్షయు, దత్తునకు రెండేండ్లు కారాగార శిక్షయు విధింపించెను.

ఇట్లు నేరస్థులందఱు శిక్షితులు కాగా రామమోహనరావు నారాయణరావు యొక్క ధనము, నగలతో బాటిప్పించి కృతకృత్యుడయ్యెను. నారాయణరావచిర కాలములోనే తన కుమారునికి సుగుణఖనియగు వనితామణి నొర్తుకందెచ్చి వివాహమొనర్చెను. కృష్ణారావు కొన్ని సంవత్సరములలో నున్నత విద్యాభ్యాసనము చేసి యుద్యోగ మొనర్చుచు కాపురమునకు వచ్చిన భార్యతోను, అపారమగు ధనముతోడను, అంతకు ద్విగుణీకృతమగు కీర్తితోడను మర్యాదగా గాపురము చేయుచు పుత్ర పౌత్రాభివృద్ధిజెంది యందఱకు దలలో నాలుకయై వర్తించుచు దనయావజ్జన్మము రామమోహనరావునకు గృతజ్ఞతాబద్ధుడై యుండెను



మిత్రులతో శ్రీ శ్రీ



కవితా సమితిలో శ్రీ శ్రీ

కూర్చున్నవారు ఎడమనుంచి : తాపీ, సెట్టి లక్ష్మీనరసింహం, గుప్త, పురిపండా శివశంకరశాస్త్రి, కః ఉన్నత లక్ష్మీనారాయణ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, కొంపెల్ల జనార్దనః

మధ్యవరుసలో ఎడమనుంచి : నాలుగవవారు శ్రీ శ్రీ



అభ్యుదయ రచయితలలో శ్రీ శ్రీ (ఎడమనుంచి ఆరవవారు)

## విరసం ప్రచురిస్తున్న శ్రీ శ్రీ సాహిత్య సర్వస్వం

★ 1 పరిణయ రహస్యము, ప్రభవ
2 అనువాద కథలు
3 అనువాద నవలలు
4 అనువాద నాటకాలు
★ 5 మహా ప్రస్థానం
★ 6 వారం వారం
★ 7 1 + 1 = 1 (రేడియో నాటికలు)
★ 8 చరమరాత్రి
★ 9 మన గురజాడ
★ 10 ఖడ్గ సృష్టి
11 జాబులు
★ 12 రెక్కవిప్పిన రివల్యూషన్
★ 13 చైనా యానం
★ 14 సిప్రాలి
★ 15 మరో ప్రస్థానం
★ 16 వ్యూలు, రివ్యూలు
★ 17. వ్యాసాలు
★ 18 ఉపన్యాసాలు
★ 19 ప్రజ
★ 20 అనంతం

★ ఇవి ఇప్పటికే వెలువడ్డాయి

తరువాతి ప్రచురణలు

**అనువాద కథలు**

**అనువాద నవలలు**

**అనువాద నాటకాలు**

**జాబులు**

## విజ్ఞప్తి

మహాకవి శ్రీ శ్రీ సంపూర్ణ రచనలని 20 సంపుటాలుగా విప్లవ రచయితల సంఘం ప్రచురిస్తోంది దీనిలో భాగంగా యిప్పటి వరకూ పదహారు సంపుటాలను ప్రచురించాం ఎంతోమంది తమ షరతుల్లేని సహకారాన్ని అందివ్వటంవల్లే విరసం యీ పని నిర్వహించగలిగింది ఇంకా నాలుగు సంపుటాలు రావల్సిన పని మిగిలుంది ఈ సంవత్సరం ఆఖరికల్లా మిగతా రెండు సంపుటాలు తేవాలని ప్రయత్నిస్తున్నాం

ఇప్పటివరకూ ప్రచురించిన సంపుటాలపై వచ్చిన డబ్బు, పెట్టిన ఖర్చులు చూస్తే కొన్ని లక్షల రూపాయల అప్పు పెరుకుపోయింది ఈ అప్పు తీర్చడం ఒక పని కాగా, మిగతా సంపుటాల ప్రచురణకు చేయాల్సిన అప్పుకోసం ప్రయత్నించాల్సి వుంది ఈ సందర్భంగా అభిమానులకు ఒక విజ్ఞప్తి చేస్తున్నాం

విరసం ప్రచురించిన, ప్రచురిస్తోన్న శ్రీ శ్రీ రచనలు కొని చదవండి. ఈ పుస్తకాలు మీకు తెలిసిన నలుగురితో కొనిపించండి ఇదే మీరిచ్చే కొండంత అండ శ్రీ శ్రీ రచనలు కూడా వెయ్యి ప్రతులు వేసి అమ్ముకోలేక పోవడం మన దురదృష్టం

ఈ పరిస్థితిని మనందరం కలిసి మారుద్దాం ఇందుకు మీ ప్రయత్న పూర్వక సహకారాన్ని స్నేహ హస్తాన్ని ఆశిస్తున్నాం

విశాఖపట్టణం
30-09-1999 **చలసాని ప్రసాద్**